# లత వ్యాసాలు



వంశీ ప్రచురణలు,
విజయవాడ - 3.

ఈ మహారచయిత లందరికీ నా హృదయపూర్వక నమస్సులు.

—లత

# కృష్ణశాస్త్రి - ఊర్వశి

ఊర్వశి అనంగానే ఒక అందాల అచ్చర తెల్లని శరీరంతో అంతకన్నా తెల్లని దుస్తులతో దివినుండి భువికి దిగి వస్తున్న ఒక వెన్నెల రేఖ... ఒక కౌముదీ కాంత కన్నుల ముందు కనుపిస్తుంది. కాళిదాసు విక్రమోర్వశీయంలో నాయిక—రవీంద్రుని లేఖినిలో క్రొత్త అందాలు తెచ్చుకొన్న ఒక విలాసమూర్తి—భావంలా — రాగంలా — చిత్రంలా మనకు కనిపిస్తుంది -

క్రిష్ణశాస్త్రిగారి ఊర్వశి- భావమూ, రాగమూ చిత్రమూ కూడా తానే అయిన ఊర్వశి. నేను కాకపోతినే అనిపించే ఊర్వశి.

నిట్టూర్పు—కన్నీరూ, తానే అయిన ఊర్వశి.

అది ఒక మహాసృష్టి... యుగయుగాలుగా ప్రేమికుడయిన కవి హృదయంలోంచి వెలువడుతున్న కన్నీటి స్రోతస్విని—ఆ స్రోతస్సు అలా నిరంతరం ప్రవహిస్తూనేవుంటుంది. కాళిదాసు, రవీంద్రుడు, క్రిష్ణశాస్త్రి— ఊర్వశి హృదయం వీరికి అవగతం.

క్రిష్ణశాస్త్రిగారి ఊర్వశిలో కథలేదు, కన్నీరు తప్ప. ఒకవిధంగా ఊహా ప్రూహాసుందరి. అనాటి కీనాటికీ నేను నీదాననే మున్నీటి తరగలకు, మిన్నేటి నురుంగులకు— తడయు వెడబాటనే! విడని కవుగిలి నేనే!

వాన చినుకుగ సొగసి—నీలమేఘమ్ముగ నెగసి, నిశినీ వెదవిపై నిట్టూర్పుగా ప్రాకి—వేయి వేలు యుగాల రేయినై పవలునై—ఆదరి కురిసిన యేడ్పు అలరి విరిసిన నవ్వైన ఊర్వశి... ఆమె మనకి ఎందుకు కనుపించకూడదు? ఒక్కసారి ఎందుకు పల్కరించి పోరాదు?—ఎవ విచిత్రసృష్టి?—ఓ కవీ! నీవు సృష్టికర్తవు కావుగదా? ప్రియోపాసనాస్నానించి రాగమయమయిన నీ కవితను రసహీనులమైన మా ముందు వుంచావు? అని ప్రశ్నిస్తే కృష్ణశాస్త్రి చిరునవ్వు నవ్వుతారు కాబోలు.

తొలిప్రొద్దు పొడుపు రేకుల పైడిదారుల పరులేమించు కన్నీరుపాట నీ ఊర్వశి.

విరజాజి కన్న నిద్దుర కన్నురెప్పల కాల్వలే నెత్తావి కలలపాట—ఈ ప్రేయసి - ఒహో ఊర్వశి.

కృష్ణశాస్త్రిగారు ఒక విధంగా ఒకరకమయిన కవితా గీతికలకి మూలపురుషులని చెప్పవచ్చును.

ఏదో అపూర్వ మధురాశక్తి స్ఫురియించుకుని అర్థమ్ము కాని భావగీతమ్ములవి.

అనేవారు బోలెడుమంది ఉన్నారు — కానీ నాకు ఎలా అనిపిస్తాయంటే "బ్రతుకెల్ల కోటి గొంతులనిడి, జోనలై పారలు నూతనగీత సుధాపథాలతో" విహరింపచేస్తాయి.

శీతాచల శిఖరోజ్వల హిమపీఠాగ్రింపైన ఆశీనులాల్ని చేస్తాయి.

విరహావేదనా పీడితుడైన కవి మనల్ని యిలా ప్రశ్నిస్తాడు—

కలువపూ బ్రతుకులో గనునోడ్పు వెన్నెలే కానాల నంటైన గతియేను ! అని "చలువ తెమ్మెరైన జాను చలచిత్తుడే కాని మాలతీ లతిక కీ మతి కవుగిలి ఏలో?" అని తనే ఆశ్చర్య పోతాడు. ఎవరు చెప్పుతారు సమాధానం ? యుగయుగాల నారీ అంతర్యం ఆ ప్రశ్నలో స్ఫురిస్తున్నది వంఘున మస్త మాణిక్యరాజ్ఞి ఊర్వశి. మహాకవి మనసులో ఎన్నాళ్ళ నుంచో వర్తిస్తున్న మధుర నర్తకి ఊర్వశి

అసలు కృష్ణశాస్త్రిగారి కవితారీతులె వేరుగాఉంటాయి. సునిసితమూ, మధురమూ, అయిన వాక్యాలతో కఠినంగాని భాషతో - బరువైన భావాలతో ఆయనగేయాలు మనల్ని ఏ ఐంద్రజాలిక జగత్తుకో తీసుకుపోతాయి.

వచన సాహిత్యం అంటే అభిమానించేవారికి క్రిష్ణశాస్త్రి గేయ సాహితి చాలా నచ్చుతుంది. అందులో ఆయన అద్భుతసృష్టి ఊర్వశి. ఆమెను గురించి ఆయన యిలా అంటారు :

వైకుంఠ మృదుకంఠ వైజయంతీమాల తెగెనేమొ ! దిగజారు జగములన్నీ దాటి - సురభి సౌదామనిగ తరళ మధుధారగా ఈశ్వరా లోకమే ఇటు వెడలెనో నేడు అని... ఆ ఊర్వశి ఎక్కడైనా వుంటే ఇంతకంటే గొప్పపూ ఆమెకు ఏ యుగంలోనూ అంది ఉండదు.— కాళిదాసు, టాగూర్లను మినహాయిస్తే !

ఆమె చూపులను గురించి క్రిష్ణశాస్త్రి వర్ణన చూడండి— అమరనాథ కంఠమాలా సుమదళాలు — గగనవాహినీ నీర

జాబిలీ పక్షుల నాట్యాలు – నీలిమాయిలు మెరుపులు, సింగి నీడల మొగ్గ్లు – అలగాలు – అలలు కలలు.

ఎంత అదృష్టవంతురాలు ఊర్వశి – ఇందరు కవుల ఊహాల్లో మెసిలిన ఆ స్త్రీకి ఎలా అభినందనాలు అందియ్యాటమో అర్థం కావటం లేదు.

తెలుగుభాష యింత సుకుమారమని ఊర్వశి చదివిన తరువాతనే తెలిసింది నాకు. అది భాషలో అందమో, కవి భావములోని సొగసో! ఊర్వశి ప్రత్యేకతలు తెలుసుకోవడానికి యింకా కొంచెం కాలం పడుతుంది.

నందనవనం నిద్ర... ...ఎలా ?

మందాకినీ మందమంద గీతానంద – మధు మాధురీ శీతలహరీ పరిష్వంగమందు బొలకించి, పుష్పించి, జీవించి, – నందనవనం నిద్రిస్తున్నది–ఇది భాషలో అందమా? భావంలో సౌందర్యమా ? ఏమో – నింగిమాలలే నీలిపందిళ్ళు పరచి యెంత తెలిమల్లెతోట వేయించినానో !

ఇందులో వాక్యం ఎంత బరువు ! కరుణ కృష్ణశాస్త్రి గారికి అభిమానం. వియోగం వేదన ఆయన్ని అభిమానిస్తాయి. ఈ సంపుటీ కరణమే ఊర్వశి.

స్వేచ్ఛనీ స్వాతంత్ర్యాన్నీ కవితలో మొదట ప్రవేశ పెట్టినది కృష్ణశాస్త్రిగారు – ఒకవిధమైన స్వప్నలోకంలో తప్ప వాస్తవికతలో ఆయన భావన కొరవడుతుందా అనిపిస్తుంది !

ఆమాటకొస్తే – లోకంకోసం కవిత్వమూ – కళకోసం కళ... అనే సిద్ధాంతాలవర్గం మన మతిపోగొడుతుంది. కనక ఆ విషయం వదిలేయటమే మంచిది.

ఏది ఏమయినా అంకితంకూడా ఊర్వశికే ఇచ్చారు ఆయన– బహుశా ఆ ఊర్వశిని ఆయన ఎదుగుదురు కాబోలు– నిజంగా వూహల్లోకాదు. ఒకసారి ఆ మనోహర మూర్తిని మాకుకూడా చూపించరూ?

వియోగినీ–విషాదమూర్తీ అయిన ఆ అచ్చరపాద మంజీర ధ్వనులు మీరొకరేనావినేది? మాకూ వినిపించరూ?

ఊర్వశి ఒక కావ్యం——ఒక నవలా——ఒక గీతం——సకల సాహిత్యప్రక్రియలకీ అదిమూలం...టాగూర్ కూడా ఇంచు మించు అలాగే వర్ణించాడు. అంటే ఔచిత్యం కాదు గనుక కృష్ణశాస్త్రిగారే టాగూర్గా భావించారంటే, బాగుంటుంది.

అందుకే కవినిచూసి ఊర్వశి ఇలా అంటుంది–

ఆనాటి కీనాటికే నేను నీదానను——నేను తొలివియోగి నిని——అంతేకాదు తొలిప్రియసిని.

చిత్రం ఏమిటంటే ఇందులో పురూరవుడు కనిపించడు. కృష్ణశాస్త్రిగారు తప్ప—— ఈ ఊర్వశి——ఆయనకోసం ఆయన సృష్టించుకొన్నది ——ఆయన వేదన నివేదన చేయటానికి ఈ ఊర్వశి ఒక వేలుపు అంతే అంకన్న మరేంలేదు ——కృష్ణ శాస్త్రి ఊర్వశి మరో కృష్ణశాస్త్రికే అర్థంఅవుతుంది—— లేదా ఆయన అంతర్యంలాంటిదే మనదీ కావాలి——ఊర్వశి తెలుసేందుకు.



# చలం - అరుణ

జీవితమంతా ముళ్ళల్లోంచి, దుమ్ములోంచి, ద్వేషాలోంచి, నిందల్లోంచి, అపనిందలలో నుంచి అంత నిర్మలంగా నడిచి అంత పవిత్రంగా ఉండగలిగేవారు అరుదు – తామరాకు మీద నీటి బొట్టు ఆకాశంలోంచి కిందికి జారే వెన్నెల రేఖ, నడిచిన ప్రతిచోటా హృదయాల మీద తన పాద ముద్రల్ని, ముద్రిస్తూ పోయే – మోహిని — అరుణ.

ఈ పాత్రాన్ని అద్భుతంగా సృష్టించిది స్త్రీ ఆంతర్యం అగాధమైనదని మరోసారి నిరూపించారు శ్రీ చలం. స్త్రీ గాని, పురుషుడు గాని ఏక కాలంలో ఒకరినే కోరటం పాతివ్రత్యంగా పతివ్రతంగా భావించబడే సమయంలో — కనీసం అలా అని ఆత్మవంచన చేసుకునే సమయంలో నిర్ణయంగా అరుణని సృష్టించి స్త్రీ హృదయం చిత్రమైనదని – అయితే ఆ వైచిత్ర్యాన్ని పైకి కనిపించేట్లు ప్రవర్తించే స్త్రీని మగవాడు ప్రేమిస్తాడు గాని భరించలేడని—అందుకనే ఆ స్త్రీ ఆకాశం నుంచి జారిరాలిన వెన్నెల రేఖలా — ఎలా వచ్చిందో అలాగే కరిగిపోతుందని చలం అంటారు.

అది తప్పు — స్త్రీ ఏక కాలంలో అయిదారుగుర్ని ఆకర్షించకూడదు. అథవా అలా చేసినా ఎవనికీ తెలియకుండా ఉండాలి. కాని అరుణ అలా కాదు. ఆమె నలుగుర్ని ఆకర్షించింది — ఆ నలుగురూ ఒకరిమీద ఒకరు అసూయ పడతారు. ఎవరికి వారే తమను [illegible] తమే అను ఆత్మీయుల మాన

గాజులు — అరవై రకాల గాజులు, పొడుగాటి వేళ్ళు, విశ్వనాథ ఇంగ్లీష్ పరిమళాలు చిమ్ముతూ మెలికలుగా జారిన కణతల మీది జుట్టు, గంటల మోస్తరు నవ్వు— సహారాలో ఒంటెల మెడలో 'గార్డెన్ ఆఫ్ అల్లా' సినిమాలో విన్నగంటల చప్పుడు జ్ఞాపకం తెచ్చే నవ్వు ఒక్కసారి విన్న తరువాత యింక జీవితంలో శాంతి సంపూర్ణంగా నశించిందని స్పష్టంగా తెలియచేసే నవ్వు.

ఇంకెవరు ? అరుణ.

ఆ అరుణని మొదట ఇలా పరిచయం చేస్తారు ఆయన- తన మొదటి స్నేహితుడి దగ్గరికి అరుణ వెడుతుంది— అతని ఊపిరి ఆగుతుంది. రక్తం ప్రవహించటం మానివేస్తుంది — ఇక్కడ చిత్రం ఏమిటంటే అది శారీరకమైన అనుభూతి అనుకుంటే — కాదు.

ఒక విధమైన నిషా - మరోవిధమైన ఆత్మీయత ఇంకోవిధమైన స్నేహం - ఇంతకంటే అపూర్వమైన ఒక దివ్యత్వపు అనుభూతి. అదెందుకో అతనికి అర్థం కాదు - కావాలని కూడా అతను అనుకోడు. ఒక్కసారిగా ఆ మాధుర్యంలో మునిగిపోయి ఉక్కిరిబిక్కిరై పోతాడు.

ఎలా వచ్చావు ? ఎంత భయపెట్టావు ? అంటాడు. లోపలి నవ్వు పెదిమలమీదికి పాకింది అప్పుడు - తాంబూలంతో యెర్రనైన పెదిమలలోపలి యెరుపు మీదికి - కాని కళ్ళు అగాధంగా లోపలికి తిరిగినయ్ - అరుణ కళ్ళు ఎవరి వంకా చూడవు. సాధారణంగా చూసిందా ఇక ఆ కళ్ళలోదేమిటో తెలుసుకునే దాకా వదలకూడదని-ఇంక విముక్తి

లేదు. ఆ యువకునికి జలగుండాల్లో పడ్డట్టే – కొండచిలువనోట్లో చిక్కినట్లే వెర్రివాళ్ళు – ఆ చూపుల అంతం కనిపెట్టినా ప్రతివారికి ఆశ – రాచకన్య వేసే ప్రశ్నలకు జవాబు చెప్పగల మనే నమ్మకంతో శిరస్సులు ఒప్పచెప్పే మూర్ఖులు జ్ఞాపకం వస్తారు. కాని ఇక్కడ మెడలు కాదు హృదయాలు.

కాని తలలు తెగటమే తక్కువ బాధ అంటారు. ఆమెను గురించి ఆమె యెంత అద్భుతమైన స్త్రీ–మనకి కూడా కనిపిస్తే బాగుండును అనిపిస్తుంది – ఆ క్షణంలో

పిచ్చీ ఎలా బతుకుతావు యిట్లా ఒంటరిగా నిన్ను చూసినప్పుడు పాపం–నీ బట్టలు వుతికి పెడుతూ నీకు కబుర్లు చెపుతూ వుండిపోవాలనిపిస్తుంది – కాని ఉండనీదుగా పాడు లోకం – అంటుంది అరుణ.

అంతేకాదు "ఈసారి నీతో ఉంటానులే" అని అతనికి ఆశ పెట్టి ఆ మరుక్షణమే కలం కాగితం కావాలోయ్ అని అడుగుతుంది. అతను నిట్టూర్చి ఇస్తాడు – ఆకాశంలో యెగిరే చిలకని పిలిస్తే యెంతలాభం – ఆమె స్వేచ్ఛగా వరాలు కురిపించాలి ప్రార్థనలూ కన్నీళ్ళు పని చెయ్యవు. కాని తనకి ఇష్టమైనప్పుడు ప్రార్థనకీ కన్నీళ్ళకీ లొంగిపోయినా ననే భావం ఎదుటి వాళ్ళకి కలిగిస్తుంది అరుణ. ఎప్పుడూ అంతే అబద్ధాలనీ తన మోనాపలీ (స్వంతం) లాగు మాట్లా డుతుంది అరుణ.

ఫో! దుర్మార్గుడా అని అతన్ని తోసేసి కుర్చీలో కూర్చుని వ్రాతలో మునిగిపోతుంది అరుణ – అదే అరుణలో మనసుకి వెర్రెత్తించేదీ – మనసులమీద తీవ్రమైన మాయ

కప్పేదీ — ఆ గొప్ప ఘోరగుణమే - దేనిమీద మనసు నిలిపితే అదేలోకం - తక్కిన లోకం బావురుమని ఏడుస్తుంది.

ఎంత విచిత్రమయిన స్త్రీ అరుణ - ఏదయినా ఒక విషయంలో అంత ఇదిగా మునిగిపోవటం ఎలాసాధ్యం. అందుకేట ఆమె అంటే అంత ఆకర్షణ లోకానికి - ప్రేమ్ సౌదాకర్ లే అంటుంది అరుణ. ప్రేమ కొనుక్కోవాలి - ప్రేమకి ఖరీదుంది.

సౌందర్య నగరిలో హృదయయాత్రికుడు ప్రేమని యాచిస్తున్నాడు అని గ్రామఫోను మీద కె. సి. డే. రికార్డు పాడమన్నది - నిజమే రూప్‌నగరమే దిల్ ముసాఫిర్ - ప్రేమ్ సౌదాకర్ లే.

రూప్ నగరంలో హృదయం యాత్రికుడు - ప్రేమ కొనుక్కోవాలి. ఇలా వినవచ్చు మరో అర్థాన్ని అరుణ అలా విరుస్తుంది. మెరిని కట్ట దిండు పువ్వుల మధ్య అరుణ ముఖం మరో పెద్ద పువ్వు.

"ఈ దిండు - షాపులోంచి నేను వస్తుంటే ఆ వూళ్లో ఒకడు గుమ్మాని కడ్డంగా నిలుచున్నాడు - బ్రష్షుల్లాగు మీసాలూ - వాడూ _ గంట నించి నా బండి వెనకాల సైకిలుమీద వస్తున్నాడు - ఈ మొగాళ్ళు కుక్కలు. బిక్క మొగం వెయ్యకే నువ్వుకాదులే" అంటుంది.

"ఏమిటి-కుక్కా, మొగవాడా? ఏది కాను నేను?" అంటాడు అతను - ఆమె నవ్వు.

"ఇంకా చెప్పులికీ, దిండుకీ, వాని టీకేస్‌కీ బిల్లు అతనే ఇచ్చాడు" అన్నది.

"మరయితే అవి ఏవి?" అంటా డతను.

"చెప్పులేమో శకుంతలఅడిగితే ఇచ్చేశాను. 'హోల్డాల్' చంద్రశేఖరం కారులో మరిచిపోయాను—వాని టీకేస్ బద్దలై పోయింది. చివరికి ఈ దిండే మిగిలింది. అది నీకిస్తానులే" అంటుంది అరుణ. ఏం చిత్రమైన స్వభావం ఆమెది. అంత తేలిగ్గా పొందగలిగిన అదృష్టమూ, అంత త్వరగా త్యాగం చేయగల్గిన తెగింపూకూడా అందరికీ ఉండవు.

పిల్లని మరిపించి చెరువుకి వెళ్ళే తల్లిలాగున నవ్వేస్తూ వెళ్ళిపోయింది అరుణ – అప్పు డతె డంటాడు.

మనసు ... ఇదంతా మనసు కల్పించుకున్న ఇంద్రజాలం కాదుకదా! కారణాలు ఎవరికి తెలుసు? దేవుడినా, సైకో ఎనాలిస్టులనా? – అని.

అంతేకాదు. అరుణ వ్యక్తిత్వం చిత్రమైంది. ఆమె ఎవరితోనూ గాఢమైన అనుబంధం ఉంచుకోలేదు – అందరినీ తనచుట్టూ తిప్పుకుని తననుంచి ఒక విధమైన స్నేహాన్ని వాళ్ళకిచ్చి వాళ్ళని ఆనందింపచెయ్యటంలో ఆమె ఏదో ఆనందాన్ని అనుభవిస్తుంది.

అతను అంటాడు – "ఇన్నేళ్ళ ఆరాధనికీ నాకు దక్కినవి ఒక చల్లని చూపు – ఒక ముద్దు పేరు – ఒక కరస్పర్శనం ఇంతే" అని.

ఈ విషయంలో చలం ఆమెనిగురించి తనకి ఉన్న అభిప్రాయాన్ని అతనిచేత ఇలా చెప్పిస్తారు.

"అవును. ఇంకా ఏంచేయాలి నన్ను నమ్మించడానికి? దేవతరావుని కామరూపిని ఎవరు ఏ విధంగా మోహించ గలరో – అంత తీవ్రంగా; అంత రమ్యంగా, సంపూర్ణంగా, అంత విచిత్రంగా మోహిస్తుంది. అలాటి స్త్రీనుంచి పురుషుడు అంతకన్న ఏం కోరగలడు? కాని యీ పురుష పశువు ఆ దేవతని – ఆ కిన్నెరని – ఆ కోయిలని తనకి వొండి, తన కాళ్ళుకడిగి, తలంటిపోసి కూర్చోమంటాడు – దాన్ని, పాతి వ్రత్యం అంటే అన్నాడు; ప్రేమ అని కూడా అంటాడు. అది మరీ ఘోరం అని

స్త్రీని గాలిలా – వెన్నెలలా – వర్షంలో పరమ సుందరమూ సహజమూ అయిన ఒక అపూర్వ కరంగా ఆయన చిత్రించారు.

నీవు నన్ను ప్రేమించావా అని ఎవరో ఆమెని అడిగితే—

"ప్రేమ... ప్రేమ...నీ కెందుకీ గోల? ఈ నిమిషంలో నేను నీదాన్ని – పూర్వం ఏమైతేనేం? ఇకముందు ఏం కాబోతేనేం??" అని విసుక్కుంటుంది.

ఒకరొకరి ప్రతిరూపం అరుణ.

"సుందరమైన కీర్తనలో ఏంతాళం? ఏం రాగం? అని అడుగుతున్నావు. అనుభవించడం చేతగాక – ఇదివరకు ఏమైనావు, ఇకముందు ఏమవుతావు? ఎందుకు ఇవన్నీ–వెన్నెలలో కూర్చుని చంద్రుడు అస్తమిస్తాడే, నిన్న ఉదయించలేదే అని ఏడిచే నిర్భాగ్యుల్ని చూస్తే నా కసహ్యం

చంద్రి డెన్నాళ్ళు వెలుగుతాడు?...అలా వెలిగితే వెంటనే నిద్రపోతావు నువ్వు" అంటుంది అరుణ.

ఎంత వేదాంతం బోధించింది ఆ కొంచెం మాటల్లో - మనకి వ్రాసిలేని అదృష్టం ఒళ్లో పడినా భరించలేం - అరుణ అంతే" అంటాడు ఆయన.

"ఈ సఫలమైన ఆనందంకన్న - ఆ తీరని వేదన యెక్కువ వాంఛనీయమేమో - ఏ సుఖ కష్టాలనే అలలమీద ఈ ప్రపంచం వూగుతున్నదో - ఆ సుఖదుఃఖభేదం నిజంగా ఉన్నదా ? ఆనందం దొరకగానే ఎన్నెల్లో పడిన బాధంతా పడనట్లే అనిపిస్తుంది." అని ఆయన చాలా ఆవేదన పడ తారు - అరుణ ఆయన అపూర్వ సృష్టి.

అప్పుడప్పుడు అనుకోకుండానే ఇంతమందిని ఆకర్షించిన అరుణకూడా తన దైన్యానికి తానే విచారిస్తుంది. ఏమిటీ కష్టం నాకు ? లోకంలో ప్రతిఅడ్డమైనవాళ్ళూ నన్ను ఏడిపిస్తు న్నారు. చూస్తున్నావా" అని అలిసిపోతుంది.

సృష్టి ఆదిగా స్త్రీలో పురుషుడి విశ్వాసాన్ని, అవి శ్వాస ఫలితాన్ని లక్షలమాట్లు చూసిన నక్షత్రాలు పకాలున నవ్వుతాయిట - ఆ నలుగురూ ఆమెను దేవత అంటారు - అలాటి విచిత్ర ప్రకృతి అదృష్టమూ ఉన్న స్త్రీ గతి చివరికి ఏమిటి ? ఈ విశ్వ సౌందర్యాన్ని ఎవరు దాచుకో గలరు?

ఇంతలో వారంరోజులనాడు బయలుదేరి ఇంకా రాలే దని భర్త ఒస్తాడు. ఒచ్చి-నీకేం లోపం చేశాను? అంటాడు- ఎట్లా చెప్పుకుంటారు స్త్రీలు ఆ ప్రశ్నకి జవాబు ?

సౌందర్యాన్ని ఆరాధించటం - అది తమకే ఉండి పోవాలనుకోటం - ఒకదానికి ఒకటి పొసగటం లేదు-అరుణ స్నేహితులు మాత్రమే కాకుండా భర్తకూడా అలాటివాడే.

నేను మనిషిని కానా-నా సౌందర్యం మీద నాకన్న ఎక్కువ అధికారం వీళ్ళకి ఎలా వచ్చింది - నన్ను నా ఇష్టం వచ్చిన తీరులో ఎందుకు బ్రతకనీయరు ? ప్రతివాడూ తన విషయంలో అక్కర్లేని నీతిని _ ఎదటివాడి విషయంలో ఎందుకు ప్రయోగిస్తాడు అని ఆశ్చర్యపోతుంది అరుణ.

కాని మనకేం అనిపిస్తుందంటే - అరుణలాటి స్త్రీలని అట్టేమందిని భరించలేమని _ ఒక్క సూర్యుడితోనే మనపని గడిచి పోతున్నది _ మరో సూర్యుడు దేనికి ?

అయితే అరుణలాటి స్త్రీ సొసైటీకి అవసరంలేదు _ ఇంతమందిని ఇన్నివిధాలుగా ఆకర్షించగలిగిన అరుణ_భర్తని కూడా తన ఆకర్షణలోకి లాక్కుని తన తప్పుల్ని క్షమించే టట్టు చేయగలుగుతుంది _ అయితే ఈ పాత్రలో ఉండే ఉదాత్తత దిగజారింది కేవలం ఒక విషయంలోనే _ అబద్ధా లాడకుండా ప్రేమ నటించకుండా ఉండలేక పోవటంతో

తన మనస్సులో ఉన్న అసహ్యాన్ని స్పష్టంగా బయ టికి చెప్పలేక మరొకరి దగ్గర విచారించటం _ అరుణ లాటి ధైర్యవంతురాలు, విప్లవకారిణి చెయ్యదు_అక్కడే ఆ పాత్ర ఉదాత్తత కొంచెం దెబ్బ తిన్నది _ తరువాత అసహ్యాన్ని దాచుకుని పైకి ప్రేమ నటించటం నీచురాలైన స్త్రీ చేస్తుంది

ఏక కాలంలో నలుగుర్ని ప్రేమించటం — చిత్రం కిందికీ, గొప్పతనం కిందికీ రావచ్చును గాని — నలుగురి మీద ప్రేమ నటించటం కొంతదౌర్భాగ్యమే అనాలి. కాగా దాని వలన ప్రయోజనమేమీ ఉండదు.

తరుణారుణసే రంజిత ధరణీ — అనే పాట విని "ఈ అణరు తరుణ కాదు" అని పెదవి విరవగలిగిన అరుణ —

"నా అదృష్ట దేవతలు నా భవిష్యత్తు ముందే నిర్ణయించారు — నా కేముంది యీ శరీరం గాక — ధనమా గానమా దేనితో యీ లోకాన్ని నాదిగా ఆకర్షించుకోగలను— నా సౌందర్యం ఒకటే నాకు దేవత లిచ్చిన వరం — ఆ వరాన్ని ఉపయోగించినప్పుడల్లా లోకం నన్ను కరిచింది. కాని ఈ అంధకారంలో ఆకాశం కొంచెం తెరుచుకుంది."

"కొత్త విధమైన ఆనందానికి కొత్త ద్వారం కొంచెం తెరిచారు. ఈ శరీరాన్ని — భారాన్ని అతిక్రమించి ఎగరటానికి ప్రయత్నిస్తాను" అన గలిగిన అరుణ —

అబద్ధాలాడుతుందనీ — ప్రేమ నటిస్తుందనీ చలంగారు అనివుండకూడదేమో అనిపిస్తుంది.

అలాటి స్త్రీలు ప్రేమించాలని ఆశిస్తారు గాని — ప్రేమించరు. వారి ఈ నిరంతరాన్వేషణలో — అతి ఉన్నతమైన వారి అభిరుచీ ఆదర్శాలలో వారి కలల్లో ఎవరో ఒకరుంటారు — ఆ ఒకరూ ఆమె కేసి చేతులు జాచి ఆహ్వానిస్తారు. ఆ ఆహ్వానపు బరువుకి తట్టుకోలేక ఆమె పరుగెత్తే పరుగు వేగానికి లోకం విస్తుపోతుంది. "నాకు మనిషికీ మనిషికీ భేదం కనిపించటం లేదు — ఇంతకంటే ఉన్నతమైనది మరేదో

కావాలి" అని తపిస్తారు అరుణ లాటి వాళ్ళు. - తప్పు తప్పుగా ఉంటుంది లోకానికి - అది లోకం తప్పూ కాదు. లోకం యీ తపనను అంగీకరించిననాడు ఈ సాంఘిక వ్యవస్థ తల్లకిందులై పోతుంది - తెలివిగల మనిషి యుగాలుగా శ్రమించి నిర్మించుకున్న ఈ సాంఘిక జీవనాన్ని అరుణలాటి వాళ్ళు ఘనాదులతో మట్టగించేస్తుంటే సంఘం వూరుకో కూడదు - వూరుకోదు కూడా.

ఆమె కలల్లో ఉన్న ఆ పురుషుడు భగవంతుడని - భయపడుతూ భయపడుతూ చలం గారు మనకి చెప్పేస్తారు. అంత భయపడుతూ చెప్పాల్సిన అవసరం లేదు అరుణని అరి గించుకోగలవాడు వాడొక్కడే - అదీగాక ఈ నలుగురి స్నేహితులకీ ఉండే ప్రాధాన్యతని కొంతతగ్గించి ఆ భగవంతు డికే మరికొంచెం ప్రామినెన్స్ ఇస్తే బాగుండేది.

ఆనాడు అందరూ నిద్రపోతుంటే-"సునో ముసాఫిర్ భజతి ఢంకా" అనే పాట విని అరుణ తొందరపడుతుంది- అందరికీ రైలు టయిమయింది అని లేపుతుంది - ఎవరూ రారు.

"సునో ముసాఫిర్ భజతీ ఢంకా"

అందరికి ఒకటే రైలు కాదు - కొందరి రైలు మూడింటికి - కొందరిది ఆరింటికి - కొందరిది పదింటికీ - నా రైలు ఆరింటికే వచ్చింది. గుడ్ బై ఆల్ అని వెళ్ళిన అరుణ మళ్ళీ తిరిగి రాలేదు.

ఏమయింది ? ఆనందంతో వూగే జీవితాన్ని ఎందు కులే అని తృణప్రాయంగా త్యజించి - జీవిత జలధి ఎంత లోతు ఉన్నదో అని దూకేయటం అందరికి చేత గాదు -

ఆత్మహత్య అపజయ చిహ్నం — అరుణ అలా చేసిందంటే ఒప్పుకోటానికి ప్రాణం ఒప్పటం లేదు.

రాగమయి అరుణ—విరాగిని అయిందేమో! లేకపోతే తనసౌందర్యాన్ని మబ్బుల్లోకి—పూలరేకుల్లోకి ఉపసంహరించుకుందేమో!

బ్రతుకులో - కొన్ని దేహాలకీ భావాలకీ మెల్లా స్వర్గ ద్వారాలు తెరిచిందో — అలాగే ఆత్మకీ ఆధ్యాత్మిక సందేహాలకీ కూడా ఎప్పుడో వచ్చి ద్వారాలు తెరుస్తుంది అరుణ అంటారు చలం గారు — కొన్ని లోపాలూ కొన్ని ఆయన నమ్మి, లోకం చేత నమ్మించలేని సిద్ధాంతాలూ ఉంటే ఉండవచ్చునుగాని అరుణ మాత్రం అద్భుతమైన సృష్టి.



# 'అమృతం' బుచ్చిబాబుసృష్టి

తెలుగులో ఆధునిక నవలా సాహిత్యంలో శ్రీ బుచ్చిబాబు గారి "చివరకి మిగిలేది" ఒకటని చెప్పవచ్చును. ఆర్థిక సాంఘిక చారిత్రిక వ్యత్యాసాలకి అతీతమై, మనిషినీ, మనిషిని స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం యొక్క శక్తుల్ని తరచి చూచినప్పుడు ఆ దృశ్యాన్ని తన్మయతతో అనుభవించగలం—కాని ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం.

ఈ జీవిత రహస్యం - దాన్ని తెలుసుకోడానికి మానవుడు చేసే ప్రయత్నం... ఏ గొప్ప గ్రంథానికయినా

పునాది - ఈ నవలకీ అదే పునాది అంటారు బుచ్చిబాబు - సామాన్యంగా చూస్తే ఈ నవలలో నాయిక కోమలి. మొదటి నుంచీ చివరిదాకా దయానిధి అంతర్యంలో జీవించింది కూడా కోమలే... కాని ఆ పాత్ర సృష్టి చిత్రంగా ఉందిగాని నిండుగా లేదు. నిధిలాటి ఉదాత్త ప్రకృతి గల దైవోపహతుడికి ఆరాధించ దగిన స్త్రీ కాదు కోమలి.

"స్త్రీత్వంలోని మాయాశరీరాన్ని వాడిశోధించినవాళ్ళకి గాని తెలియదు" అని ఆలోచించ గలిగిన మేధావంతుడికి.

"నాతో సీకట్లో ఏం పని మీకు? రాత్రి మా ఇంటికి రాకండి ఎప్పుడూ. మా అమ్మ సూసిందంటే తన్నుద్ది" అనే కోమల్ని ప్రియురాలిగా ఊహించుకోవటం కొంచెం బాధ ఉంది - "ఆఫ్ హ్యూమన్ బాండేజి" అనే సోమర్సెట్ కు మీ నవలలో మిల్ డ్రెడ్ అనే స్త్రీకి కోమలికీ చాలా పోలిక లున్నాయని కొందరంటారు - కాని చివరిదాకా కోమలి అతనితోనే ఉంది.... ఆ ఉంది అనటంలో రచయిత చక్కని మలుపు తిరిగారు - చదివేవాళ్ళు కోమల్ని దాదాపు మర్చిపోయే సమయంలో కోమల్ని మళ్ళీ తీసుకొస్తారు ఆయన.

పోతే దయానిధి లాటి వాడికి ముందు స్నేహితురాలై తరువాత ఏకరాత్రి ప్రేయసి అయి - అతనివల్లనే తల్లిఅయిన స్త్రీ అమృతం. ఆతని వల్లనే తల్లి అయిందన్న విషయం స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాగానిదాయటానికి ప్రయత్నించారు రచయిత.

తద్వారా ఏదో "సస్పెన్సు" ఉందని ఆయన అనుకుంటే పొరపాటు పడ్డారనవచ్చును - కథ కన్న నవలలో నిజా

యితీ చాలా అవసరం - ఎక్కువగా కథకులైన బుచ్చిబాబు గారు - కథకి మాత్రమే టెక్నిక్ అయిన "దాపరికం" నవలలో ఉపయోగించడం బహుశా అవసరమేమో!

మిసమిసలాడే చామనఛాయ - గంభీరమైన కళ్ళు - ఉంగరాలు తిరిగి మెడ అంతా ఆవరించుకొన్న జుట్టు - బలమైన నడుం - గట్టిగా గుండ్రంగా ఉండే భుజాలు - అదీ అమృతం ఆకారం - పెళ్ళిచేసుకుని - ఇల్లాలుగా - కోడలుగా తన బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తిస్తూ- నిధి తల్లి చనిపోయి నందుకు పరామర్శ చేయటానికి వచ్చిన పెద్దయింటి పిల్ల అమృతం నిధికి వరసకి మరదలు.

నిజంగా దయానిధి లాటి ఫజిల్‌ని తేలికగా సాల్వ్ చేసిన అమృతాన్ని చూస్తుంటే మనకి ముచ్చట అనిపిస్తుంది. తల్లిని గురించి అందరూ వెక్కిరింపుగా మాట్లాడుకున్న సమయంలో అమృతం ఆమెకు సానుభూతి చూపించిఅనుకోకుండా నిధి ఆంతర్యానికి దగ్గర అయింది - తల్లి చేసిన తప్పుకి బిడ్డలు ఎలా అలమటించి పోతారో షేక్స్‌ఫియర్ మొదలు బుచ్చిబాబు దాకా అందరికీ కథావస్తువే అయింది.

అనిపిస్తుందిగ దా-హామ్లేట్ కి అమృతం లాటి స్నేహితురాలుంటే అంత గందరగోళం పడక పోయేవాడని.

పసుపుపచ్చ ఖద్దరు చీరలో అమృతం - కాళిదాసు నాటకంలో శకుంతలని గుర్తుకు తెచ్చే అమృతం - ఆమె కేసి చూస్తూంటే లోయలో సూర్యాస్తమయాన్ని జ్ఞాపకం తెచ్చే అమృతం నిజంగా నిధికి తగిన సహచరి అనిపిస్తుంది మనకి - ఆ సాహచర్యంలో వేటనుంచి తిరిగి వచ్చిన ఆదిమ మానవుడిని ఆదరించే గుహాలోస్త్రీని గుర్తుకు తెస్తుంది - అమృతం -

అమృతానికీ – నిధికి మరో మేనమామ కూతురు సుశీలకీ క్షణం కూడా పడదు – అయితే ఏం? రాజ్య వినాశం జరిగిన తరువాత శిథిలాలని చూసి ఒకప్పుడు మహావైభవం అనుభవించిన రాణీలా నవ్వుతుంది అమృతం సుశీలని చూసి.

ఇందులో బుచ్చిబాబు ఒక చిత్రమైన విషయం అస్పష్టంగా చెప్పారు. సుశీల నిధితల్లిని ఎత్తిపొడిచి దూరం అవుతుంది. ఇందిర అలా అని దూరం అవుతుంది. కోమలి అలా అని చంపకాయ తింటుంది. అతని తల్లిని అవమానపరచని స్త్రీ ఒక అమృతం మాత్రమే – అందుకే ఆ నవలకి సరి అయిన నాయిక అమృతం.

ఎదుటి వాళ్ళకి చికాకు కలిగించకుండా తన వైపు ఆకర్షించుకోవడం అనేది అమృతం స్వభావం – సుశీల "నాకేం తెచ్చావు బావా ?" అంటే–

అమృతం "బావా నువ్వు పట్నం వెళ్ళేప్పుడు మా వూళ్ళో దిగావంటే నీకు సొజ్జప్పాలు, పూత రేకులు ఇస్తాను" అంటుంది –

అంతేకాదు, నిధి ప్రేమించిన కోమలి విషయంలో సుశీల నాగమణి అందరూ చులకనగా మాట్లాడుతుంటే అమృతం అలా మాట్లాడదు. పైగా అంటుంది–"లేదు బావా ఎంత మొద్దునైనా నాకు అర్థం అవుతుంది – పిచ్చివాళ్ళని చూసి మనం జాలి పడ్డట్లే – పిచ్చివాళ్ళు మనని చూసి జాలి పడతారు" అని పతితురాలని అనిపించుకుంటున్న తన తల్లినీ. కవితురాల్నీ అనర్హురాలూ అని కూడా అనిపించుకుంటుంది.

కోమలినీ – అమృతం ఏవగించుకోదు – ప్రేమాస్పదులైన ఆ ఇద్దరు స్త్రీలవల్లా లోకం సానుభూతిని పొందలేకపోతున్నా దయానిధికి ఆ సానుభూతి ఇచ్చింది అమృతం. అందుకే అతనిచేత ప్రేమించబడింది.

తన ఇష్టాల్ని అంగీకరించే ఏ ఆడదాన్ని మాత్రం ప్రేమించకుండా ఎలా ఉంటాడు మగవాడు ?

"నీలాంటి ఔదార్యం సానుభూతి అందరికీ వుంటే సంఘం స్వర్గంగా మారును అమృతం" అంటాడు దయానిధి. పిచ్చికుక్కలాటి సంఘం చేత కాట్లుతినే దయానిధికి అమృతం మాటలు మందుగా పని చేసినయ్.

భర్తని గురించి అమృతం నిధితో కొన్ని విషయాలు చెప్తుతుంది – అవన్నీ మానవుడికి మామూలే అనే నిర్లిప్త తతో అతి సహజంగా అతని ఇతర ప్రణయాన్ని గురించి చెబుతుంది – మళ్ళీ మరునాడు.

"మా వారిని గురించి నీతో అట్లా ఎందుకు చెప్పానా అనిపిస్తున్నది" అంటుంది.

ఇక్కడ రచయిత ఇలా అంటారు : "రహస్యం యొక్క పరిమితి తగ్గినకొద్దీ – అనుభవంలోని విలువ సన్న గిల్లుతూ ఉంటుంది" అని – ఆ తరువాత డాక్టరు చదువు తున్న నిధి చేత అమృతానికి మూఢాచారాల మీద ఒక లెక్చరు ఇప్పించి అమృతంచేత నిషిద్ధం అయిన పని చేయి స్తారు.

ఆధునిక నవలా రచయితలలో బుచ్చిబాబు మొదలుకొని లతదాకా ఒక చిన్న అలవాటుని పోగొట్టుకోలేకపోతున్నారు

నడచిపోతూన్న కథని బలవంతాన ఆపి – తమకు ఉన్న అభిప్రాయాల్ని అక్కడ వ్రాసేసి మళ్ళీ కథని అంది పుచ్చుకోవటం దీని వలన కొన్ని చోట్ల రచనలు కుంటుపడితే మరికొన్నిచోట్ల అయిదు కాళ్ళతో నడుస్తుంది – సమానంగా మాత్రం నడవదని చెప్పవచ్చును – అలాగే ఇక్కడా జరిగింది – తను చెప్పినమాట ఎలాగూ వింటుంది అమృతం – అయినప్పుడు ఉపన్యాసం చాలా అనవసరం – అలా ఉపన్యాసం ఇప్పించటం వలన నిధికి ఉన్న అధికారం కన్నా ఉపన్యాసానికి ఉన్న అధికారం బలపడి కథ దెబ్బ తిన్నది.

సుశీల నిధి పెళ్ళిలో అతనితో ఇలా అంటుంది– "నీవు అమృతంలాంటి స్త్రీని పెళ్ళి చేసుకుంటే నేను ఆశ్చర్యపడను" అని.

అప్పుడే అమృతం నిధికి ఒక ఉత్తరం వ్రాసి ఈ ఉత్తరాన్ని చించివేస్తావు కదూ ? అని చివర మరోవాక్యం చేరుస్తుంది– ఆ అతి మామూలు ఉత్తరాన్ని ఆఒక్క వాక్యంతో ప్రేమలేఖగా మార్చివేసింది అమృతం.

"అది కాదు బావా ! కోమల్ని గురించి నీ కెంతటి అభిమానం ఉందో తెలుసుకోవాలని అన్నానుగాని నిన్ను బాధ పెట్టాలని కాదు. అయితే ఈ విషయం నీతో మాటలాడటంలో నేనేమన్నా తప్పు అంటే క్షమించు.

స్త్రీ యీ ధోరణిలో మాట్లాడినప్పుడు తెర వెనుక జరుగుతున్న నాటకంలో పాత్రగా మారుతుంది. మనం వినొచ్చు – తెలుసుకోవచ్చు, కాని అర్థం చేసుకోలేం – రచయిత – తన కథానాయకుడైన నిధిని మరీ జితేంద్రియు

డిని చేసి అతని జీవితంఅంతటిలోనూ ఒకే ఒక రాత్రి అమృతంతో ప్రసాదించారు — అంతటి విప్లవవాది... డాక్టరూ — ప్రేమ అనే విషయంమీద కొత్త అభిప్రాయాలు ఉన్నవాడు అయిన దయానిధి అది వరకు తన వాంఛల్ని ఏం చేశాడు ? అన్న సంగతి వదిలివేస్తే ... అమృతమూ అతనూ ఇంకా ఇంకా దగ్గరై — అన్ని రహస్యాల్ని ఛేదించి అన్ని లోకాల్ని శోధించి... అన్ని శిఖరాల్ని సాధించి — ఒంటి జీవితంగా కొట్టుకుని — విశ్వ రహస్యానికి ప్రాణం పోశారు — శరీరాన్ని అనుభవంతో ఆత్మగా చేసుకున్నారు.

ఈ వర్ణన అనన్యసామాన్యం — అమృతం లాంటి పాత్రని సృష్టించడమూ — ఇలాటి వాక్యాలతో శారీరక మానసిక అవస్థల్ని కలిపి ఒకేసారి మనకి చెప్పటమూ — బుచ్చిబాబు గారికే చేతనవును. పై నాలుగు వాక్యాలూ చాలా మందికి రచయిత వాక్యాలతో చేస్తున్న ఇంద్రజాలం అనిపిస్తాయి. అందులో ఉన్న యదార్థం ఎంత సుందరమైనదో కొందరికే తెలుస్తుంది — ఆ కొందరికీ ఆయన అమృతం — అద్భుతమే ! సర్వేంద్రియాలూ విడిపోయి జీవకణాలుగా మనకికూడా ఆ క్రమంలో మారతాయి — అలా మార్చటం లోనే రచయిత మరో సృష్టికర్త అవుతాడు.



# రావూరి సృష్టించిన పార్వతి

ఎటు చూసినా శకుంతలే కనిపిస్తోందా! గృహస్థుకాని గృహస్థుకి. ఎటువిన్నా—తండ్రీ అనే పిలుపే వినపిస్తున్నది, తండ్రికాని ఆ తండ్రికి—

సంతానరహితులైన పార్వతీ మహేంద్రుల వేదనని రావూరి మహోత్కృష్టంగా చిత్రించారు. ఆంధ్రదేశంలోని మధ్యతరగతి కుటుంబంలో జన్మించిన ఒక కళాకారుడి పవిత్రమైన ఆవేదనకి చేసిన విచిత్ర రూపకల్పనమే నెలవంక నవల. అప్పుడెప్పుడో నా చిన్నతనంలో తెలుగులో తీయదనాలు ఇంకా రుచి తెలియకముందు పత్రికలో సీరియల్ గా వస్తున్న ఈ నవలను చదివాను—ఇందులో కథావస్తువు చిత్రమైనది—ప్రణయానికీ ప్రేమకీ సంబంధించింది ఇందులో ఏమీ లేదు.

కేవలం సంతానంలేని దంపతుల ఆవేదన ... ఇది ఒకటే ఇందులో కథావస్తువు—దీనికి పార్వతి కథానాయిక—అతి మామూలు తెలుగు ఇల్లాలు. కన్నుమూస్తే వేళకు మెళుకువరాదు—భర్త పలహారానికి ఆలశ్యం అవుతుందని అలాగే కూర్చునే స్వభావం ఆమెది — ఆమెలో ఉన్న మాతృత్వం చాలా ఉన్నతమైనది — ఎవరిచేత అయినాసరే అమ్మా అని పించుకుంటే అంతే చాలు.

తెలుగునాట భార్యాభర్తల అనుబంధం ఎంత మధురమయినదో — అంత ఉదాత్తమైనదిగా చిత్రించారు రచయిత. "భార్య అన్నం వడ్డించింది, ఆయన అపుపోసనం

పట్టాడు – వెన్నకాచిన నెయ్యి వెయ్యబోతూ — చెయ్యి తియ్యండి వేడి, అన్నది పార్వతి. అని నేతి గిన్నె కిందపెట్టి ఎర్రపడ్డ రెండువేళ్ళనీ ఊదుకొని చెంగుకి రాచుకుంటుంది. అతి సామాన్యమయిన వర్ణన. అతిశయోక్తులు లేవు–అసహజ మైనది లేదు— చెట్టుమీద నిద్రపోయే పిట్టలేవో కిచకిచ లాడి నాయి – దూరంగా ఎక్కడో రేడియోపాట వినిపిస్తున్నది– ఒక కారు బుస్సున పరుగెత్తింది – సరిగ్గా ఇలాటప్పుడే గాజుల తాత వచ్చి–పక్కవూళ్ళో ఒక తల్లిలేని పిల్లవాడిని పెంచుకో మని సలహా ఇస్తాడు – పార్వతీ మహేంద్రలు పొంగిపోతారు ఆ సూచనకి – అన్న చిత్రమైన ఒక దృశ్యాన్ని కల్పించారు రచయిత. గాజులు వేయించుకొన్న పార్వతి తాతకు దండం పెడితే – "మా అమ్మ బంగారు తల్లి కడిపెడు బిడ్డలతో వర్ధిల్లాలమ్మా" అంటాడు. పార్వతి పిచ్చిదైంది. అలాగే లేచివెళ్ళి భర్తకు నమస్కారం చేసింది – ఆయన ముఖం మీద చెట్టునీడ పడింది అన్న ఆయనభావంఏదో ఎవరికీ అంతుబట్ట నివ్వలేదు. అహుశా వేదనే అయిఉంటుంది.

అంతేకాదు – అయిదారు పిల్లలతో వచ్చిన కుక్కనీ కోడెదూడ తల్లి అయిన ఆవునీ – కూడా తన కధకి చిహ్నా లుగా తీసుకుంటారు రచయిత. ఈ వర్ణన చూడండి— ఒక గొల్లవాడు ఎవరి ఇంటిదగ్గరో పాలు పితకడానికి ఆవునీ దూడనీ తోలుకు పోతుంటే – అతని భార్య పసిపిల్లవాడిని చంకను వేసుకొని నెత్తిన చిట్టుబుట్టతో నడుస్తున్నది – ఎదు రింటాయిన పిల్లవాడిని బ్రతిమాలి లాలించి మొగం కడుగు తున్నాడు – ప్రక్కయింటి అవ్వగారు బియ్యంపెట్టి కొయ్య

తోటకూర కొని - చేటలో కూర మెదిపి గుప్పెడిపడుతూ మాటిమాటికీ కొసురుతోంది - పార్వతి. అనుకోకుండానే పెద్ద ముగ్గువేసి ఇంకా ఏవో అందాలు తెస్తున్నది దానికి— మంగ తన గుమ్మంలో మామూలు ముగ్గుగర్రిలు గీస్తూ ఏం అత్తా అంతసేపు వేస్తున్నావు – అంటే పార్వతి నవ్వి మా ఇంట్లో పండుగ, మా ఇంటికి ఒక పసివాడు వస్తాడు అంటుంది. ఉత్సాహపు టలలమీద హృదయాన్ని తామర దోనెను చేసి ఉయ్యాల లూగిస్తూ మాతృత్వపు పువ్వాడిని పై కెగ జిమ్ముకొంటున్న ఆ మధుర మూర్తిని చూపిన మంగ మనసేకాదు మన మనసూ కరిగిపోతుంది. అచ్చమైన తెలుగు ఇల్లాలు పార్వతి - బాలింతరాలిని అని వీధిలోకి ఎవరొచ్చినా అన్నీ ఇస్తుంది ఆమె.

కాని దురదృష్టవశాత్తూ వారు తెచ్చుకున్న నూతన శిశువు చనిపోతాడు. వాళ్ళఅమ్మను విడిచి నాదగ్గర ఉంటాడా రాముడు ? అంత పవిత్రిత నాకెక్కడుంది అని కుమిలి పోతుంది పార్వతి - కాలం గడుస్తుంది. ఆడపడుచు కూతురు కమలమీద ఆమె వాత్సల్యం అంతా ప్రవహిస్తుంది-అయినా ఆమె ఆడపిల్ల ఏనాటికో ఒక నాటికి తన ఇంటికి పోకతప్పదు- ఇలా అనుకుంటుంది ఆమె - తండ్రిఅయినా బిడ్డఅయినా దైవమే అని - సావిట్లో ఉన్న కృష్ణ విగ్రహాన్ని చంకన వేసుకొని "ఇన్నాళ్ళనుంచు ఈ పార్వతి నిన్ను కనిపెట్టలేక పోయింది బాబూ! ఇక మరచిపోదు, అటుంది.

ఆక్షణంనుంచీ ఆమె మాతృత్వపు వాంఛ జలపాతమై బాలకృష్ణునిమీదకు ప్రవహిస్తుంది. ఆ చిన్నివిగ్రహంతో

మాటాడుతుంది, లాలిస్తుంది, పాటలుపాడుతుంది. అవిగ్రి హాంలో ఉన్న చైతన్యంవిషయంలో ఆమె ఏ కొంచెమూ శంకించదు.

"చూడు కృష్ణా! నాఆశలన్నింటినీ పూసలుగాగుచ్చి రోజూ నీమెళ్ళో వేస్తాను - నాలోఉన్న చీకటినంతటినీ ఆ యమునలో పారేస్తాను. నాకన్నుతీసి నీకు నెమలి పింఛంగా అమరుస్తాను" అంటుంది-ఆమె అపూర్వమైన భక్తిభావంతో తన్మయురాలై పోతుంది పార్వతి.

అదిచూచి వియ్యమ్మగారు ఇలా అంటుంది: "పోనీ ఇదీ మంచిదే. కడియంచేయించపోతే కంఠెగామారింది.మాధవుడి విషయములో నేను పడిన ఆవేదనంతా పోయింది. అసలు మాధవుడే నీబిడ్డ అయినాడు. ఇంత సుకృతం గల దానివి కనుకనే భగవంతుడిలా పరీక్షచేసి మరీ పాదంపెట్టాడు నీ మనస్సులో" అని.

తెలుగు నవలా ప్రపంచంలో ఈమాదిరి పాత్రసృష్టి మరెక్కడా లేదు - విశ్వనాథవారి గిరికకి పార్వతికీ కొంచెం పోలికలున్నయ్. గిరిక భగవంతుడిని ప్రియుడిగా భావిస్తుంది. పార్వతి శిశువుగా భావిస్తుంది.

ఒకనాడు ఆమెకి ఒక కలవస్తుంది. కృష్ణుడు సాక్షాత్కరించి, "మానవులు జీవిత రహస్యాలు తెలుసుకోలేరు - తమకు ఆప్తులైనవారిని నేను వేరుచేయడంలో ఉన్నరహస్యం వారిని నాకు దగ్గరచేసుకోవడమే — భవబంధాలను అలా చుట్టించి విడిపించినప్పుడే నన్ను చూచుకొనే అవకాశం లభిస్తుంది — తనవారు దూరమైనారని జీవులు తాపత్రయపడ

తారుగాని కొంచెం యోచిస్తే తెలుస్తుంది–బిడ్డలు లేనివారికి బిడ్డడిని, తండ్రిలేనివారికి తండ్రిని – గురువులు లేనివారికి గురువును – ఇంకా ఎవరెవరికి వారివారిని నేనై ఉంటాను” అని చెప్పి మాయమైపోతాడు. కాలం గడిచిపోతుంది – మాతృత్వంమీద మమకారం తగ్గినతరువాత మాతృత్వం లభించే సూచనలు కనిపిస్తాయి పార్వతికి– ఆయింట్లో యిప్పుడు అయిదారుగురు పిల్లలు. అన్నిరకాలవాళ్ళూ ఉన్నారు. అందరూ ఆమెపిల్లలే ఇప్పుడు.

పార్వతి ప్రసవించింది – మగబిడ్డ – అప్పుడుకూడా క్రిష్ణ విగ్రహాన్ని వదలదు ఆమె. రెండురోజులు గడిచినాక మొదటిసారిగా పార్వతి జీవితంలో పసివాడికి పాలుఇచ్చింది– పిల్లవాడి లేత పెదవులు పార్వతివక్షాన్ని తాకినాయి – ఆమె మనసంతా ఒక సెలయేరైంది – శరీరం అంతా పచ్చికబయలుగా గగుర్పొడిచింది – వక్షస్థలంలో మాతృభావం మధుర స్థితిని మేల్కొలిపింది – ఇద్దరు పిల్లలు అనుకొంది ఆమె – ఒకసారి కృష్ణా అనుకొంది ఆమె – అంతే ఆమె చైతన్యం అంతరించి పోయింది.

ఆ తరువాత నాటకంగా వ్రాసిన ఈ కథ ప్రదర్శిస్తారు మహేంద్రులు. నవల అంతంలో ఆయనకూడా వెళ్లిపోతారు. ఇది నెలవంక. ఇందులో నాయిక పార్వతి. కథ హాయిగా సాగిపోతుంది. కరుణ ఇందులో ప్రధానంగా కనిపించే రసం. భక్తి ఇందులో మాతృత్వంతో కలిసి మరింత శాశ్వతమైంది– ఇందలి ప్రణయం, ప్రేమ ఇలాటివేవీ లేవు – అవినీతి అధర్మం అసలేలేవు. ధర్మసమ్మతంగా నడిచిన ఈనవలలో ఆడు

గడుక్కీ పార్వతి మసల్నీ ఆపివేస్తుంది. ఇదేమిటీ ఈవిడ ? అని ముక్కుమీద వేలు వేయిస్తుంది. చివరకి పార్వతి చని పోయినప్పుడు కూడా అయ్యో అనిపించదు. అదేదో అలాగే జరగాలి కాబోలు అనిపిస్తుంది. వేదాంతానికీ జీవితానికీ అనుభూతులకీ వాంఛలకీ కలిపి ముడిపెట్టిన ఈనవల తెలుగు నవలా వాఙ్మయంలో చెప్పదగింది. పార్వతి మరీ చక్కని సృష్టి. అచ్ఛమైన అమ్మ పార్వతి.



# బాపిరాజుగారి 'శశికళ'

బాపిరాజుగారు ఉత్తమ చిత్రకారుడని కొందరంటే ఉత్తమరచయిత అని మరికొందరంటారు. కాని గొప్ప భావుకులుమాత్రం అవును - అందులో శశికళని భావించ టంలో రచయిత కన్న చిత్రకారునిపాళ్ళే ఎక్కువగా కని పిస్తున్నాయి.

అందాలు చిందే అజంతా స్వప్నసీమలలో అక్కడి మనోహర పరిసరాల మధ్య సృష్టింపబడిన వర్ణమయ ప్రపం చంలోని ప్రతిగీతమూ... గుహల్లోని దివ్యరేఖాగీతికలలోని ప్రతి చుక్కనీ వెతికి అన్వేషించి ఆలాపించారు ఈ గీతాన్ని బాపిరాజుగారు - కొన్నివేల సంవత్సరాలకిందట ఎండిమి యాన్ అనే గ్రీకు యువకుడు ఆ లోయలో ప్రతిఫలించే శశి కళను స్త్రీమూర్తిగా భావించి ఆరాధించటం జరిగిందనీ...

ఇన్నివేల ఏళ్ళ అనంతరం తను మళ్ళీ అన్వేషిస్తున్నానని ఆయన అంటారు.

ఆమాటకొస్తే ఈ సర్వసృష్టినీ స్త్రీమూర్తిగా వూహించుకొని ఆస్త్రీని తన ప్రేయసి అనుకోకపోతే ఏరచయితా కలం పట్టలేడేమో. అందుకే వారి స్త్రీసృష్టి ఇంత రమణీయమూ అపూర్వమూ అవుతున్నది.

"కన్నులు కానని రూపం, పిలిచీ కవుగిలికందని భావం తలచీ - తెరవైపున నా చేతులు మోడ్చి అరమూతలు నా తీరని కలలై"... తెర ఉన్నది మన మధ్య అని విచారిస్తారు.

ఆమె ఎవరో తెలియదు. ఎప్పుడూ చూడనుకూడా లేదు. అయినాసరే ఆమె తనలోనే ఉన్నట్లుంది ... ఇదే ఆత్మైక్యత అంటారు. ఆమెకోసం ఎదురు చూస్తారు. "యావన మధుమధురాలలో భావాభావస్థితిలో కిన్నెరతీగెల మీటి మిన్నుదరియు రాగంలో" ఆమెకోసం నిరీక్షిస్తారు.

ఆమె కనిపించదు. కనీసం ఎవరోకూడా తెలియదు. ఎందుకిలా వేధిస్తున్నదో ఈ అజ్ఞాత ప్రేయసి అదీ తెలియదు. అందుకే ఆ అమరమూర్తిని ఉద్దేశిస్తూ "వోచెలీ నీవెవరు? వారాసిలో పొంగు కెరటాలవో నీరాల లోతులో నీలాలవో! తుంగవీచీ శిఖర భంగరేఖారచిత శుక్తిగర్భాంతరిత ముక్తాఫలాచ్ఛవో?" అని ప్రశ్నించి సమాధానం రాకపోగా "బ్రతుకంతా నిరీక్షణము - ఈ నిశిలో నడికిరేయి ఎవరో నాతోటకొచ్చి పూమొగ్గల విరియచేసి ముంగిటిలో అడుగులిడిరి" అనుకుని ఎవరికోసం గీతికలు ఝురులై ప్రవహిస్తున్నాయో అని నిట్టూరుస్తారు ఆయన.

అదేమో తెలియదు. ఆవేదనా అన్వేషణా లేకపోతే ఏ రచన అయినా జీవితం లాగానే అసంపూర్తిగానే ఉండి పోతుంది. ముగింపులేని రచనలాగానే జీవితమూ పేలవ మవుతుంది. అందుకేకాబోలు ప్రతిరచయితా తీరని అన్వేషణ ఒకటి సృష్టించుకుని తన ఆవేదనని చిరంజీవిని చేసుకొని తద్వారా మహారచయిత అవటం.

"ఒక రాగాలాపనలో-ఒక గీతావిస్తరణంలో ఎవరో ఒక దివ్యరూప ఎవరో ఒక తళుకుచాన కిరణంలా – సుర చాపంవర్ణంలా" మెరవకపోతే ఆ రాగాలాపనకీ ఆ గీతావిస్తరణకీ కూడా ముగింపులేదు – ఇది రచయితకీ గాయకుడికీ మాత్రమే కాదు- ఒక రేఖావిన్యాసము. ఒక వర్ణం ప్రసరింపు- వీటిమధ్య ఎవరో ఒక దివ్యభావ, ఎవరో లావణ్యమూర్తి అమ్నాయసునాదంలా అతివేల రసాపగలా కనిపిస్తేనేగాని చిత్రకారుడి కుంచె కదలదు.

బాపిరాజుగారు ఈ మూడూ కావటంచేత ఆయన కళాసృష్టిలో ఈ శశికళ నిరతిశయానందమై – పరిమళాంగి – ప్రవిమలాంగి పారిభద్ర ప్రసూనాంగి – విధురేఖై విరిసి సుర మధువై కురుస్తుంది – కొన్ని సంవత్సరాల క్రితం విన్న ఆయన గీతం ఒకటి తన ప్రభావాన్ని నామీద ఇంకా ప్రవహింపచేస్తూనే ఉంది—చంద్రలోకం తూర్పుదెసలో ఒక చిన్నలోకం ఉన్నది అని మొదలుపెట్టబడిన ఈ కథాగేయం నా స్మృతిపథంలోంచి ఎప్పటికీ పోదు – ఆ లోకంలో వాడిపోవని పూలతోటలు, నీడ ఎరుగని నిండు పున్నములు. పరిమళాలే పిన్నవాయువులు.

నిజంగా అలాంటి లోకాన్నే వూహించుకుని ఆ లోకంలో జీవించగలగటం సాధ్యమే అయితే ఆ రచయిత కన్న అదృష్టవంతుడు సృష్టిలో మరెవరూ ఉండరు — అందులో ఆత్మ మధ్య అమృతమూర్తి అయిన ప్రియురాలి సమక్షం కూడా లభిస్తే అంతకన్న జీవితపరమార్థం మాత్రం మరే ముంది ?

భూతకాలానికి అంతం, భవిష్యత్‌కి ప్రారంభమూ అయిన వర్తమానం మాత్రమే మానవుడికి మిగులుతుంది. దాన్నే అనుభవించలేని రసవిహీనుడు మానవుడు — దీనికి విభిన్నుడైన కళాకారుడు మాత్రం భూతకాలంలోని ఎండిమియానై భవిష్యత్‌లోని వూహారచయిత అయి వర్తమానంలో బాపిరాజు అవుతాడు. త్రికాలాల్లోనూ జీవించే ఈ అదృష్టవంతుడి వూహాలలో గీతాలలో వర్ణ విన్యాసాలలో ఈ సర్వసృష్టి తనని తాను దిద్దుకొంటుంది.

నీలి కలువ పుటాలలో తేలిపోవు నీలి మలుపు — నీల రక్త హృదయంలో సోలిపోవు కాంతి సూక్తి—నెమలి గళము వంపులో నృత్యమాడు నీలి నిగలు — నీలాకాశ రహస్యము— కాళిందీ జరినీరము — ఇది శశికళ రూపం.

శశికళ శ్యామసుందరమూర్తికి ప్రతిరూపం — నీల గగన ఘన శ్యామసుందరి ఈ శశికళ — అవ్యక్తమైన ఆవేదన భరించరానిదిగ తయారయినపుడు — ఆంతర్యం అభిసారికగా మారిపోయినపుడు మనందరి మనసుల్లో కూడా శ్యామసుందర రూపం నిండుకుంటుంది. ...

అదే శశికళ అయి — ఊర్వశి అయి — ఎంకి అయి — కిన్నెరసాని అయి రాధ అవుతుంది.

అందులో శశికళ మరీ అదృష్టవంతురాలు— బాపిరాజు గారు ఒక్క రచయిత మాత్రమే కాదు—

చిత్రరూపము రంగు శశికళ — శిల్పకౌశలము శశికళ— చిత్రకారుని కుంచె శశికళ — శిల్పి చేతులో ఉలి శశికళ. అంతేకాదు వీణ తీగల మెట్లు — గానమాధుర్యాలు — కావ్య రసములు రాగాలు తాళాలు వేగమయిన గీతాలు అన్నీ శశి కళ. అంతేనేమో అతడైన కళామూర్తి లోకం? శిల్పి సుందర రేఖలలో సొబగైన వర్ణాలు దేనికంటే స్త్రీని మూర్తించటానికి.

కవి పాట ఒడుగు మెదుగులలోని భావనలు దేనికంటే? జ్వలిత గీతాతటిచ్చలిత కాంతుల మధ్య అతని దేవిని నిరూపించటానికి.

నృత్యోపాసి అంగహారాలలో ఒహారిటే వ్యూహ దేని కంటే? నృత్యానృత్యాలలో తన స్త్రీ కోసం వర్తించటానికి

సర్వ సృష్టినీ తన చుట్టూ తిప్పుకుంటున్న స్త్రీ మూర్తీ, అసలే గర్విష్టి అయిన రమణీ... శశికళ అయినప్పుడు మరింత గర్విస్తుంది — ఆ మహామూర్తి మోళ్ల మోకరిల్లిన — పేద పూజారి గుండెలలో నేల బరువులు దాటిపోతాయి— నీలగగ నాలు తేలిపోతాయి. కాలవాహినులు గడచిపోతాయి. అత నలాగే తన స్త్రీ ముందు మోకరిల్లి ఉంటాడు... కాదు కొన్ని యుగాలుగా అలాగే ఉన్నాడు. ఇంకా కొన్ని యుగాలు అలాగే ఉంటాడు. అప్పుడు... అప్పు డేమవుతుంది?

అప్పుడే ఆ స్త్రీ శశికళ అవుతుంది... ఆ మానవుడు మహా రచయిత అవుతాడు — ఆ సృష్టి అపూర్వమూ అవుతుంది. బాపిరాజుగారి వచనరచనకన్న గీతికారచన చాలా జిగి అయినది — వ్యూహాలోకానికి గీతికా రచన మకుటంలేని మహారాణి... వచన రచనలో వాస్తవికతేగాని వ్యూహ తేలిపోతుంది — అందుకనే వారి వచనరచన కొంచం పేలవంగా కనిపిస్తుంది — తరువాత ఏ స్త్రీ నయినా వయోవిపక్షత పాటించకుండా బాల అనే విశేషణం కలిగిస్తారు ఆయన. అది కొంచెం ఎబ్బెట్టుగా కూడా కనిపిస్తుంది.

అలాటి చిన్న చిన్న లోట్లు వచనరచనలో ఉన్నాయి. కాని వారి గీతికా రచన అద్భుతమైనది. ఏ విధమైన అపశ్రృతీ కనిపించదు అందులో...

ఆయనంటారు — కవియే అయినా, గాయకుడైనా, రవిలా రంగులరాజే అయినా, రాజ్యములేలేపూజ్యుడే అయినా, ఆజ్యముపోసే యాజ్ఞికుడైనా — మతకర్తైనా శృతికర్తైనా వితముల తెలిసిన విజ్ఞుండైనా — ఆశయ ప్రణయము ఆరాధించును — అంటారు. అంతేకాదు ఆమెయే అతని ఆలంబనం — అదుముకొన్న ఆమె తలపులు చిదిమిరాల్చు హృదయ సుమములు — అదుగో అప్పుడే సకల శిల్పసుందరాలూ సర్వరసానందాలూ నిండిన దేవాలయాలన్నీ తన స్త్రీకి నిర్మిస్తాడు.

నిజంగా ఈ తెలుగు భాషలో ఎన్ని ఒదుగులూ ఒంపులూ సొంపులూ ఉన్నాయనుకున్నారు ? నా మటుకు నాకే అనిపిస్తుంది — నా భావాన్ని ఇంత బాగా చెప్ప

భాషతో నాకు జన్మ నిచ్చినందుకు భగవంతుడికి ఎలా కృత
జ్ఞత తెలియచెప్పాలీ అని ?

నా తెలుగు......

దానికి సాటిలేదు. సంగీత సరస్వతి తన విన్యాసాలను ఇందులో తొంగిచూస్తే సాహిత్య సరస్వతి తన విలాసాలని ఇందులో వెలయిస్తున్నది. ఎందరో మహా రచయితలు మరెం దరో కావ్యనాయికలు– మరింకెంతో అపూర్వ రమణీ సృష్టి.

ఒకతె ఎంకి. ఇంకొకతె కిన్నెర – మరొకతె ఊర్వశి వేరొకతె శశికళ.

రమణీ పాదమంజీరాల గలంగలలో మహా రచయితల మధుర గీతికా ప్రసూనాంజలి... అది శశికళ.

---

# గురజాడవారి 'మధురవాణి'

శ్రీ అప్పారావుగారు సృష్టించిన ఉజ్వల స్త్రీ మూర్తి మధురవాణి – ఆమె వేశ్య ... అయితే నేమి ? వృత్తిలో అధర్మం చేయదు. నమ్మిన వాడికి అపకారం చేయదు – అమిత తెలివి గలది.కనుక ఒక ప్రయోజనం కోసం షడ్యంత్రం పన్నితే అది వేరే విషయం. తను చేస్తున్న వృత్తి మంచిదని ఆమె అనుకోదు. అందుకే కేవలం ధన సంపాదనమే ఆమె ధ్యేయం కాలేదు.

మొట్టమొదట అప్పారావుగారు మధురవాణిని ఇలా పరిచయం చేస్తారు మనకి. రామప్ప పంతులు ముట్టుకుంటే కస్సుమని —

"మొగవాడి కయినా; ఆడదానికయినా నీతి వుండాలి కాని - వద్దంటే చెవిని పెట్టరు గదా ? అంటుంది. వేశ్య అంటే అంత చులకనా పంతులు గారూ ? గిరీశం గారితో తెగతెంపులు చేసుకున్నదాకా నేను పరాధీనురాలనే" అని నీతి చెప్తుంది.

"మనిషి అయినాక, ఒక నిర్ణయం మీాద నిలవాలి. నేను డబ్బుకు కక్కుర్తి పడను అని చల్లగా చివాట్లు పెడుతుంది.

పూటకూళ్ళమ్మ ఇంటిమీాదకు పోట్లాటకు వచ్చి గిరీశాన్ని ఎక్కడ దాచావు ? అని అడిగితే "నాకు దాచటం కర్మమేమి ? నేను మగనాల్ని కాను, వెధవ ముండనీకాను- నా యింటికొచ్చేవాడు మహారాజుగా పబ్లిగ్గా వస్తాడు" అంటుంది.

ఇందులో మధురవాణికి అప్పారావుగారు శాస్త్ర పక్షపాతం చూపించారనే తోస్తూంది - అది చాలా తెలివి గలది, హాస్యప్రియ, సహృదయురాలు.

మధురవాణి ఎంత తెలివి గలదంటే... ఎందుకూ పనికిరాని రామప్పపంతులికి కూడా నువ్వు గొప్పవాడవు అనే అభిప్రాయం కలిగిస్తూంది. అసలు స్త్రీత్వంలోని చమత్కారమే అది. తెలివిగల స్త్రీ ఎప్పుడూ మగవాడికి పిరికి మందు

పోయదు. ఆ స్త్రీని అంతర్గతంకా నిలుపుకుని వాడు గొప్ప వాడు కావడానికి అవకాశం వుంది.

సౌజన్యారావులాటివాడికి మధురవాణి లాటి స్త్రీ దొరికితే అతను ఇంకా గొప్పవాడు కావడానికి అవకాశం కలిగి వుండేది అనిపిస్తూంది నాకు.

రామప్పపంతులు వీధిలోకి వెడుతూ, "వీధి తలుపు వేసు కుని సంగీత సాధకం చేసుకో. విద్య వంటి వస్తువు లేదు. యీ వూళ్లో దుర్మార్గులు వున్నారు. స్నేహితులమనీ, బంధువుల మనీ, పేరుపెట్టుకుని వస్తారు" అని గట్టిగా చెప్పి మరీ వెడ తాడు. అతను వెళ్ళిన కొంచెం సేపట్లో కరటకశాస్త్రిలు వచ్చి తలుపు తడతాడు.

రామప్పపంతులు చెప్పిన ప్రకారం స్నేహితులకు బంధు వులకు తలుపు తీయకూడదు. అందుకని మీరు బంధువులా ? అని అడుగుతుంది. కాదంటాడు శాస్త్రులు. అతనికీ తలుపకల వున్నది మధురవాణి అని తెలియదు. పోనీ స్నేహితులా ? అని అడుగుతుంది. అదీ కాదంటాడు.

"మా పంతులు గారికి బంధువులూ, నేస్తులు కూడా గాకపోతే తలుపు తియవచ్చును" అని రామప్ప పంతులు వాక్యపాలన చేసి, బుద్ధిమంతురా లనిపించుకుంటుంది మధుర వాణి. తీరా తలుపు తీశాక కరటక శాస్త్రుల్లూ, ఆడవేషంలో శిష్యుడూనూ.

"ఇదేమిటి ఈ వేషం? నాటకమల్లా చెడి పగటి వేషాల్లోకి దిగిందా ? పెట్టిపుట్టారు కదా; ఏల ఈ అవస్త ?

అంటూంది. ఆ వాక్యాలలో జాలి, ఆప్యాయత, పొగడ్త, ఇన్నీ వున్నాయ్. ఆడవేషంలో వున్న ఆ పిల్లవాడిని చూసి "ఎవరికి పెళ్ళి చేస్తారూ ? మా పంతులుకి కాదుకదా ?" అంటూంది.

కరటక శాస్త్రుల్లు నవ్వి "ఏకానారీ సుందరివా దరివా అన్నారు త్రిలోక సుందరిని. నువ్వు దొరికిన తరువాత మా పంతులుకి ఇంకా పెళ్ళెందుకు ?" అంటాడు.

ఆవాక్యంలో మధురవాణి అందం అతి సహజంగా మన కళ్ళకు కడుతూంది. అంతేకాదు ఇంకోటిఅనిపిస్తూంది—అరసికుడికి కవిత్వ నివేదనంలాగా, ఈ మధురవాణి రామప్పపంతులు, గిరీశంలాటివాళ్ళ పాలిట ఎలా పడ్డదా అనిపిస్తూంది.

"నీ బుద్ధికి అసాధ్యం వుందా ? డబ్బుకి అసాధ్యం వుందా ? దయచేసి ఈ చిక్కుల్లోంచి తప్పించు అని కరటక శాస్త్రులు వేడుకుంటే మధురవాణి నిట్టూర్చి యిలా అంటుంది : "బుద్ధికి అంతా అసాధ్యమేకానీ, డబ్బుకి ఎక్కడా అసాధ్యం లేదు"అని.

సరే ఇంతలో రామప్పపంతులు వస్తాడు. ఆ పిల్లవంక అతను చూస్తున్నప్పుడు మధురవాణి జెలసీ నటిస్తుంది. అలా నటిస్తేనే గానీ, పంతులు తనను మదురవాణి ప్రేమిస్తున్నదనే విషయం నమ్మడు. ఇక్కడ జెలసీ లేనిదే ప్రేమ లేదు అని అప్పారావు గారు మనకు చెపుతారు. కానీ తనలో తానే అపాత్రదానమైనందుకు కుళ్ళిపోతున్న మధురవాణి నిట్టూర్పు తుఫాను గాలిలా మనకు వినిపిస్తూంది.

రామప్పపంతులు మధురం సిరాబుడ్డి తేఅంటే "నాకంటే మధురం కనిపించిన తరువాత యింక నే నేందుకు అంటుంది. ఆ అనటంలోనే అదంతా నటన అనే విషయం మనకి స్పష్టంగా కనిపించేట్లు చిత్రించారు అప్పారావు గారు.

ఆ తరువాత ఆమె హాస్య ప్రియత్వాన్ని యిలాచూపిస్తారు — ఒకరోజున రామప్పపంతులు "నేనే చిన్నతనంలో ఇంగ్లీషు చదివివుంటే, జడ్జీల ఎదుట ఫెళఫెళలాడించేద్దును" అని కోతలు కోస్తాడు. మధురవాణి చాలాగంభీరంగా ముఖం పెట్టి "మాటలు నేర్చిన శునకాన్ని వేటకు పంపితే, ఉసుకో మంటే, ఉసకో అంది" అంటుంది. "నేనా శునకాన్ని" అంటాడు రామప్పపంతులు.

"హాస్యాన్ని కన్నాను. మిమ్మల్ని హాస్య మాడక పోతే ఊర్లోవాళ్ళని హాస్యమాడితే వూరుకుంటారా మరి ? అంచేత, కుక్కన్నా, పందన్నా మిమ్మల్నే అనాలి" అని సర్దేస్తుంది. అక్కడి నుంచి లుబ్ధావధానులు వచ్చి ఉత్తరం చదివి వినిపిస్తాడు. అక్కడ మధురవాణి నవ్వుతుంది. లొటిపిట అంటూ ఆమె నవ్వే నవ్వు, ఉప్పెనలా మనల్ని కూడా ముంచివేస్తుంది. ఆ తరువాత ఆమె స్వభావాన్ని వివిధ పరిస్థితులలో వివిధ రకాలుగా వ్యాఖ్యానిస్తారు అప్పారావుగారు. ఆమె చెడ్డపరిస్థితులలో వున్నప్పుడు ఆమె నటిస్తున్నదే కానీ, ఆమె చెడ్డ స్వభావం కలది కాదు అని స్పష్టంగా మనకి అర్థమవుతుంది. తప్పజారి నేల రాలిన సుమసుందరి బురదలో చిక్కుకున్నట్లు అనిపిస్తుంది.

ఆఖరి రంగంలో ఆమె వ్యక్తిత్వం మనకి స్పష్టంగా కనుపిస్తుంది. యాంటీనాచ్ అయిన సౌజన్యారావుగారి మంచి తనాన్ని చూసి, మధురవాణి అతనిని ప్రేమిస్తుంది. ఆయన వేశ్య ముఖం చూడరు కనుక, మొగవేషంలో ఆయన దగ్గ రకు వెడుతూంది. అక్కడ గిరీశం వుండి ఆమెను గుర్తు పడ తాడు. అక్కడ సౌజన్యారావుతో ఆమె చేసిన సంభాషణ అపూర్వం.

"నాకు ఒక సందేహం. మీరు యాంటీనాచ్ కదా ? వేశ్యలను పాటకు పిలవకపోతే వాళ్ళు బ్రతకటం ఎలాగండీ ? అంటూంది ఆమె.

"పెళ్ళి చేసుకుంటే సరి" అంటా రాయన.

పొరపాటున కూడా వేశ్య శరీరం ఆయనకు తగుల రాదని అంటారు ఆయన. అది విన్న మధురవాణి బిత్తర పోతుంది. లుబ్ధావధాన్లు ప్రాణం రక్షించే సూత్రం ఒక్క వేశ్య దగ్గరే వుంది. ఆ వేశ్య మీ దగ్గరనుండి ప్రేమ కోరు తుంది. ఆ పాటి త్యాగం చేయలేరా ? అంటుంది. సౌజన్యారావు తటపటాయిస్తాడు. చివరకు కుదర దని తలవూపుతాడు. మధురవాణి వెళ్ళిపోవడానికి లేస్తుంది. అన్యాయంగా బ్రహ్మహత్య చేయించటం దేనికని ఆమెను తిరిగి వెనక్కు పిలుస్తాడు ఆయన — ఆమెకు కావల్సింది ఒక ముద్దు. అంత మాత్రమే అయితే సరేనంటాడు. మొగవేషం వదలి నిలబడుతుంది మధురవాణి.

అంతటి సౌజన్యారావు పంతులు ఆమెను ఎగాదిగా చూసి, "ఇంకా కొంచెంసేపు నీవు యిలాగే నిలబడితే

ఏ మరతు పెడితే ఆ మరతుకే లొంగిపోతామో అని భయం వేస్తున్నది'' అని అంటాడు. ఆమె కది గర్వకారణం.

మృచ్ఛకటికలో వసంతసేనకీ, కన్యాశుల్కంలో మధుర వాణికీ చాలా పోలిక లున్నాయి. సౌందర్యం, సంగీతాల్లోనే కాకుండా ప్రేమించటంలో కూడాను. కాకపోతే ఒకటే భేదం- ఆమె చారుదత్తుడిని పొందగలిగింది. ఈమె సౌజన్యారావుని పొందలేకపోయింది.

అలా అనటానికి వీలులేదు. తను కోరిన ముద్దుని ఆయన యియ్యవస్తే, ఆగండి వ్రతం చెడగొట్టడం మాకు అలవాటు లేదు అని అదికూడా తీసుకోదు. సౌజన్యారావు ఆమె త్యాగా నికి చాలా ఆశ్చర్యపోతాడు. ఆమె మంచితనానికీ, సంస్కా రానికీ, తెల్లపోతాడు. చివరికి ఆయనకు నమస్కరించి వెళ్ళి పోబోతూ, బల్లమీాద వున్న భగవద్గీతను చూసి ఇది ఏమి టండీ అని అడుగుతుంది.

సౌజన్యారావు ఆ పుస్తకాన్ని ఆమెకు యిస్తూ ప్రపం చంలో తరించాలంటే యిదే మార్గం. ఇంతకన్న మరో మార్గం లేదు అని అంటారు. ఆ పుస్తకాన్ని కళ్ళకద్దుకుని క్రిష్ణ ద్వితీయురాలై ఆగదిలొంచి వెళ్ళిపోతుంది మధువాణి. ఆ క్షణంలో మన కళ్ళవెంబడి నీళ్ళు తిరగకుండా వుండవు. తను చేసే వృత్తి మీాదా, ఎంత అసహ్యమో, గత్యంతరం లేక ఆ జీవితంలోనే తనెలా యిమిడిపోయిందో, మనకి చెప్పి వెళ్ళి పోతుంది ఆమె. మధురవాణి పాత్రసృష్టిలో ఏ విధమయిన అపశృతి లేదు. అసహజత అసలే లేదు. సంస్కృత సాహి త్యంలో వసంతసేనకు మధురవాణి పూర్తిగా సరిపోలుతుంది.

అది ఒక అపూర్వ సృష్టి. అప్పారావు గారి కన్యాశుల్కానికి కాల నిర్ణయం లేనట్లే మధురవాణి పాత్రకు వయోనిర్ణయం లేదు... ఆమె స్త్రీ త్వానికి ఇందిర.



# శ్రీదేవి సృష్టించిన 'ఇందిర'

"నా బ్రతుకులో ఆక్షేపించ దగినది ఏదీ లేదు కృష్ణ మూర్తీ! అనవసరంగా లేనిపోని గొప్ప గొప్ప ఫోజులు నా దగ్గర నటించకు. మూర్ఖులందరిలాగా బ్రతకటం నాకు అసహ్యం! ఇదొక పోటీ ప్రపంచం. పెద్దచేప చిన్నచేపను మ్రింగుతుంది. నిన్ను నేను మింగడానికి ప్రయత్నించకపోతే నువ్వు నన్ను మింగుతావు. అందరూ అంతే — ఈ సంధి యుగంలో అందరం గొంగళ్ళలోనే అన్నాలు తింటున్నాం. ఆదర్శాలకోసం హరించిపోవాలనే తహతహ నాకెన్నడూ లేదు. ఆ మాట కొస్తే నీకూ లేదు. మనందరి తాపత్రయం ఒక్కటే హాయిగా జీవించడం. నువ్వు చేస్తున్నదీ ఆ పనే — నేను చేసున్నదీ ఆ పనే" అని ఒక సార్వకాలిక సత్యాన్ని నిర్భయంగా చెప్పేసింది యిందిర.

"నా యిల్లు నేను కట్టుకుంటుంటే ప్రక్కనుంచి నడిచి వెళ్ళేవారి నెత్తి మీద యిటుకలు పడ్డాయంటే నే నేం చేయ గలను? ఎవరి మట్టుకు వాళ్ళు చూసుకు నడవాలి" అంటుంది

(6)

ఆశోపహతులయిన అనేక మంది తెలివిగల అమ్మాయిలకి ప్రతినిధి అయిన ఇందిర.

ఇటీవల వచ్చిన నవలలో కాలాతీత వ్యక్తులు మంచి నవల — అందులో ఇందిర మరీ మంచిపాత్ర. ఆ అమ్మాయి ఏదో ఒక కంపెనీలో స్టెనోగా పని చేస్తూ, తన కష్టాలన్నీ కన్నీటినీ, సమస్యల్నీ హేండ్ బాగ్‌లో పడేసి, జిప్ తగిలించి పైకి మాత్రం తన ఆకర్షణని ఉపయోగించి, కృష్ణమూర్తి, ప్రకాశంలాంటివాళ్ళతో తిరుగుతూ కొంతచెడ్డపేరు తెచ్చుకుంటుంది. అందుకు ఏమాత్రం బాధపడినట్లు మనకి కనుపించదు. కాని ఆమె అంతర్యంలో అణగిపోయినఅగ్నిపర్వతాలు తండ్రికై లుకు వెళ్ళినప్పుడు కృష్ణమూర్తితో గడుపుతున్నరాత్రి సమయంలో హఠాత్తుగా బయటపడి మనల్ని దిగ్భ్రాంతుల్ని చేస్తాయి.

"నా మీద నాకే జాలిలేనప్పుడు ఇంకొకళ్ళనుగురించి ఎక్కడ ఆలోచించను? దేనికయినా ఒక లిమిట్ ఉంటుంది. అది దాటాక విరక్తి అనే పెద్ద మైదానంలో అన్ని అభిమానాలూ ఇంకిపోతాయి" అని జడ అల్లుకోవడం ఇందిరకే చేతనవును. ఒంటరి కల్యాణిని చూసి జాలి పడిన ఇందిర ప్రకాశం చేయూత పొందిన కళ్యాణిని చూసి అసూయ పడుతుంది.

త నెందుకు సానుభూతి సంపాదించుకోలేక పోతున్నది? ఇతరులు తనను చూచి ఎందుకు జాలిపడరు? దానికి కారణం ఒక్కటే — ఆకర్షణ వ్యామోహాన్ని కలిగిస్తే సానుభూతి

ప్రేమను కలిగిస్తుంది. ఆ సంగతి గ్రహించలేని ఇందిర కల్యాణినిచూచి అసూయపడుతుంది.

ఇందిర అబద్ధాలుకూడా ఆడుతుంది. కల్యాణి ఏ పరిస్థితుల్లో వెళ్ళిపోయిందో సరిగ్గా చెప్పక మభ్యపెడుతుంది. ఇందిర — ఆ అబద్ధాలు చెప్పక తప్పలేదు. వెధవ అబద్ధాలు లెక్క ఏమిటి ? ఇంతకన్న ఘోరాలూ చేస్తాంటేను ?

అంతేకాదు. ఇందిర శీలవతికూడా కాదు. ప్రశాంతంతోనూ, క్రిష్ణమూర్తితోనూ రెండురాత్రిలు గడుపుతూంది. తన నగలు వెళ్ళబోసి బాస్‌దగ్గర పదిరూపాయల నోటు తీసుకుని సినిమాకు పోతూంది.

ఇన్ని దుర్గుణాలు కల యిందిరలో — ఆ దుర్గుణాలు కూడా అందంగా అమరిన ఇందిరలో — బోలెడు సద్గుణాలు ఉన్నాయి తన సమస్యల్ని యితరుల నెత్తిన రుద్దని గర్విష్టి. తన అందాన్ని ఫణంగాపెట్టి ప్రపంచాన్ని జయించాలని చూసిన 20 వ శతాబ్దపు క్లియోపాట్రా — చివరకు చిత్తుగా ఓడిపోయి పెళ్లిచేసుకున్న భారతదేశపు పేదరాశిపెద్దమ్మగా మారిపోయి వూరుకోటం కొంచెం లోటు అనిపిస్తూంది. అయితేనేం, ఇందిర అన్ని దుర్గుణాలలాగా అదీ అందంగానే వుంది.

తన కీ జీవితంలో కావల్సింది ఒక్కటే— నేనున్నాను ఇందిరా భయంలేదు అనగలిగిన మగధీరుడు ప్రకాశం తిరిగి వచ్చినప్పుడు ఇలా అంటుంది ఆమె—

"ఈ ప్రపంచంలో ఒకరికోసం ఒకరు ఏదీ చెయ్యరు ఎవరికోసం వాళ్ళే చేస్తారు. నువ్వు నన్నెప్పుడూ లేని మనిషివి

తోమగా తోమగా గట్టిపడతా వనుకున్నాను. ను వ్వసలు పుట్టుకతోనే సగం మనిషివి. బీటలు వేసిన వ్యక్తిత్వం నీది" అని. అదివరకు వలచి శారీరకంగాకూడా మైమరచిన ఇందిర తనపొరపాటుకు చింతించి, ప్రకాశాన్ని వదిలేస్తుంది.

ఇందులోనే ఇందిరవ్యక్తిత్వం మనకు స్పష్టంగా కనుపిస్తుంది. ఎప్పుడో తొక్కేసిన బురదని తల్చుకుంటూ బ్రతుకంతా బరువుచేసుకునే మామూలు భామామణి కాదు ఇందిర.

కదిలేదీ, కదిలించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ, ఆమెకు కావాలి. ఆనుకుంటేనే విరిగిపోయే చెదల స్తంభంలాటి ప్రకాశంతో ఆమెకు అవసరంలేదు. ఆక్షణంలో అది అవినీతి అని మనకీ అనిపించదు. అవును మరి, అంతకన్నా ఎవరుమాత్రం ఏంచేస్తారు ? అనిపిస్తుంది. ఆలా అనిపించటంలోనే రచయిత ప్రతిభ ఇమిడివుంటుంది.

వైదేహి అనే అమ్మాయి పెళ్ళిచేసుకోవటం యిష్టంలేక పారిపోయివచ్చి దాక్కున్నప్పుడు ఇందిర ఆ అమ్మాయితో యిలా అంటుంది—

"ఈ పశువు కాకపోతే మరో నందికేశుడు ? ఎవడో ఒకడు. అసలు ఈ కాలంలో జీవితమే ఒక పెద్ద పశువుల సంతగా తయారయింది. అమాయకంగా సుమతీశతకం నీతులన్నీ నిజమే అని నమ్మి, ఆచరణలో పెడితే అందరూ తలోచెయ్యివేసి మనల్ని వెనక్కు నెట్టేస్తారు. మనతరం వాళ్ళవి కొత్తరకం సమస్యలు — వీటినితీర్చే నాథుడటుంచి, అర్థం చేసుకునేవాడుకూడా లేడు. అందుచేత తీర్థంలో

జనాన్ని మోచేతులతో నెట్టుకుంటూ ముందు కెళ్ళటమే" అని బ్రహ్మాండమయిన జీవితసత్యాన్ని చెప్పేస్తుంది ఇందిర.

ఈ నవల మొత్తంమీద ఇందిర పాత్రలో విచిత్రమూ వుంది, వైవిధ్యమూ వుంది — ఉదాత్తత కొంచెం లోపించింది. అబద్ధాలూ — అప్పుచేయడాలూ అబ్బాయిలతో తిరగడాలూ ఇంకొంచెం ఉదాత్తంగా చేయచ్చును. ఉదాత్తత అంటే ఏమిటి? అని ప్రశ్నిస్తే-

క్రిష్ణమూర్తి వచ్చినప్పుడు ఇంటద్దె యిమ్మని షాహుకారు వస్తే తను నిజంచెప్పేసి కృష్ణమూర్తిని సూటిగా అప్పు అడిగెయ్యొచ్చును. అలా కాకుండా అత నివ్వబోతున్నాడని తెలిసికూడా "మ రేముందోయ్ సిల్లీప్లాజెక్సు ఇలాంటివంటే నా కసహ్యం" అని మహారాణిలా మాట్లాడింది అంటారు శ్రీదేవిగారు.

అది మహారాణిలా మాట్లాడటంకాదు—రాణి అసలు తలకాయ వంచదు. ఇలాంటిచోట ఉదాత్తత దెబ్బతింది.

తరువాత ఏ ఉత్తమరచయిత అయినా మోడల్‌గా పెట్టుకున్న వ్యక్తిని మక్కీకి మక్కీగా పాత్రను తయారుచేయకూడదు. కొంచెం అందమయిన మార్పులు అవసరం.

ఇందిర పాత్ర బ్రహ్మాండంగా దెబ్బతిన్న సంఘటన ఈ నవలలో మరొకటి వుంది.

పెళ్ళి చేసుకోవడానికి తయారయిన ఇందిర కృష్ణమూర్తి, కల్యాణి డాక్టరులకోసం ఎదురుచూస్తూ ఉన్నప్పుడు ఇందిర యిలా అంటుంది-

"ఏమిటి కృష్ణమూర్తీ! విసుగెత్తి చచ్చిపోతున్నాను, ఎప్పటికీ వూడిపడడేం యీ డాక్టరు? వీళ్లిద్దరూ మనల్ని మోసం చేశారు" అంటుంది.

ఇంత అసహ్యంగా యిందిరచేత మాట్లాడించకూడదు. జీవితంలో సమస్యలన్నీ తీరిపోయిన ఇందిర ప్రశాంత గంభీర మయిన మహానదిలా మారిపోవటం జరగాలిగానీ ఇంకా యితర్లని అనుమానించి తిట్టటం పాత్రౌచిత్యానికి దెబ్బ.

అంతకన్నా ఘోరం మరోటి — ఇందిర కల్యాణిని చూసి భయపడటం — అంతదాకా ఇందిరంటే ఉన్నఆకర్షణ ఒక్కదెబ్బన ఎగిరిపోయింది. దీనితో — ధర్మాన్నిచూసి అధర్మం పారిపోయింది. న్యాయాన్నిచూసి అన్యాయం జంకింది. క్రమాన్ని చూసి అక్రమం అసహ్యించుకుంది — అలాఅయితే ఇందిర చేసింది తప్పు అనే అనాలి. కానే కాదు— ఇందిర ఏ తప్పూ చేయలేదు. నాగార్జునసాగరం నిర్మించటంలో రంగనాథుని విగ్రహం కొండమీదకు తరలించటం పెద్ద తప్పూకాదు, నేరమూకాదు—జీవనసౌధ నిర్మాణంలో తను ఎత్తిన దర్వాజాకి తలటాకించి బొప్పికట్టించుకున్న అమాయకపు కల్యాణినిచూసి ఇందిర పారిపోవటం దేనికి?

ఎదుట వెళ్ళి చేతులు చాచాలి — అదీ ఇందిర.

చివరకు ఇందిరచేత ఒక సుదీర్ఘ మయిన ఉపన్యాసాన్ని యిప్పించి, పూర్తిచేశారు — "ఆశలూ, స్వప్నాలూ, అనురాగాలూ, అన్నీ పెంచుకో — కానీ అవసరంవచ్చినప్పుడు సంకోచం లేకుండా శస్త్రచికిత్స చేసెయ్" అన్నది ఆ ఉపన్యాసంలో ఒక వాక్యం.

దీనితో నే నేకీభవించను - కాలాతీత వ్యక్తి కనుక ఇందిర అనటంలో తప్పులేదు - కానీ అది అంత తేలిక కాదు- శస్త్రచికిత్సానంతరంకూడా కుట్లూ, మచ్చలూ మిగులు తాయి. అవికూడా అంతర్థానమయ్యే సర్జరీ ఏదయినా ఉంటే ఆ సిద్ధాంతం అమల్లో పెట్టవచ్చును.

ఇక నవలను గురించి :

ఆద్యంతమూ చక్కని భాషతో, విచిత్రమయిన వాక్యాలతో - కాలాతీతవ్యక్తులతో నడిచిపోయింది. కొన్ని చోట్ల నాలుగు వాక్యాలలో చెప్పవలసింది పదివాక్యాలు వాడటం- ఇంకా కొన్నిచోట్ల,

"ఏమిటో ఈ బ్రతుకులు, సగం నలిపేసిన నల్లులు" లాటి పేలవమూ, చౌకఅయిన వాక్యాలు వాడటం జరిగింది. కల్యాణిపాత్ర విసుగెత్తించింది. డాక్టరు చక్రవర్తి ఆమెను ప్రేమించి ఉండడని నా కనిపించింది. అంత మరీ పాతచింత పండు పెట్టిన తాటాకుబుట్టలా నీళ్ళు కారిపోయే కల్యాణిని ప్రేమించిన డాక్టరునిచూస్తే జాలివేస్తుంది. కారు ఏక్సి డెంట్ అనవసరం - కథను పెంచడానికైతే తప్ప.

మూడువందల పదునాల్గు పేజీల తరువాత కథ యిక అనవసరం. ఏ పేరాదగ్గర ఆపేసినా అందంగానే ముగిసి వుండేది, ఉపన్యాసానంతరం కాకుండా.

కారులో కల్యాణికల; కారు ప్రమాదం - రామి నాయుడు మరణం, ఇందిర ఉపన్యాసం లేకుండాఉంటే - ఇంకా ఉదాత్తతనిచ్చేది నవలకు - ఏది ఏమయినా, శ్రీదేవి గారు ఇందిరను సృష్టించి గొప్పగా ఆలోచింపచేశారు -

ఆడవాళ్లు యిలాంటి వ్రాతలు వ్రాయకూడదని నీతులుచెప్పే వాళ్ళకు ఎప్పుడో ఒకప్పుడు ఒక ఇందిర తటస్థపడి, ఇందిర లంటే హడలు పుట్టించి ఉంటుంది. అంతేకానీ ఇందిర అందమైన పాత్ర. స్త్రీత్వం నిండిన నిషాసీసా ఇందిర.

---

# శరత్ - కమలలత

ఆమె వైష్ణవి కమలలత.

ఆమె జీవితం ప్రాచీన వైష్ణవ కవి హృదయాల అశ్రు గీతం లాంటిది. ప్రాచీన ఛందస్సులో కలయికా లేదు — వ్యాకరణంలో దోషాలా—ఉన్నాయి—కాని దానిని ఆ దృష్టితో విమర్శించడానికి వీలులేదు — ఆ కీర్తన ఎవరిహృదయాల్లోకి చొచ్చుకొని పోతుందో వారికే తెలుస్తుంది — ఆ గీతంలోని శోభ.

అది సంధ్యాసమయంలోని రంగు రంగుల ఆకాశ చిత్ర పటం లాటిది. అది నామరహితం — సంజ్ఞారహితం — కళా శాస్త్రసూత్రానుగుణ్యంగా దాన్ని పరిచయం చేయటం కూడా అవమానకరం — అంటాడు శరత్‌బాబు కమల లతని గురించి.

శరత్‌బాబు నవలలన్నిటిలోకీ శ్రీకాంత గొప్పనవల— అతని నాయికలు — హిరణ్మయి: చరిత్రహీనుల్లో, కమల: శేషప్రశ్నలో, రాజ్యలక్ష్మి. శ్రీకాంతలోనూ నాయికలు — విచిత్రమైన స్త్రీలుకూడ—

కమలలత కూడా శ్రీకాంతలోని మరో స్త్రీ - ఆమెను ఎవరూ గుర్తించలేరు. అయితేనేం ? శరత్ రచయితగా ఆమెకు అత్యంతమైన ప్రాముఖ్యాన్ని ఇచ్చాడు. అతను చిత్రించిన పాత్రలలో ఆమె అతని వ్యూహాలోకంలోని ఆదర్శ స్త్రీమూర్తి.

రాజలక్ష్మి కూడా ఉదాత్తమైన వ్యక్తి - కాని కమలలతముందు దివిటీముందు దీపం రాజలక్ష్మి - శ్రీకాంత్ ఆ ఇద్దరు స్త్రీలని ప్రేమిస్తాడు. కాని కమలలతమీద అతనికున్న ప్రేమ అంతర్వాహిని - రాజలక్ష్మి మీద అతని ప్రేమ పొంగి పొరలిపోయే మహానది.

శ్రీకాంత్ మొదట ఆమెను చూసినప్పుడు-ఎక్కడో ఎప్పుడో ఆమెను చూశాననుకుంటాడు ఆమె వయస్సు ముప్పైకంటే ఎక్కువుండదు. శ్యామలవర్ణపు శరీరం, చేతులకు కాసిని ఇత్తడిగాజులు, జుట్టుముడి వీపుమీద వేలాడుతోంది. మెడలో తులసిమాలలు - చేతుల్లో మరోజపమాల.

ఆమె ముఖంకేసి చూసి నేను అత్యంత ఆశ్చర్యాన్వితుడ నయ్యాను - ఈ ముఖం కళ్ళూ ఎంతో పరిచితముతైనట్లూ - పైగా నడిచేతీరుకూడా ఇదివరకు చూసినట్లూ - అనిపించ సాగింది అంటాడు శ్రీకాంత్. వెంటనే కమలలత సంభావణ ప్రారంభిస్తుంది-

"గుర్తించగలిగావా చెప్పుగోసాయీ ?"

"లేదు ఎక్కడో చూశానని అనిపిస్తుంది."

"బృందావనంలో చూశావు"

ఇదీ వాళ్ళ మొదటి పరిచయం – కమలలత ఆశోప హతురాలు, అదృష్ట హీనురాలు – అందుకే తన సర్వస్వాన్ని విసర్జించి వైష్ణవి అయిపోయింది. కాకతప్పలేదు.

ఒకనాటి సంధ్యావేళ శ్రీకాంత్‌కి తన కథ ఇలా చెపుతుంది కమలలత–

"ఒకనాడు గౌహర్ చెప్పాడు– అతడి బాల్యమిత్రుడు (శ్రీకాంత్) అతని ఇంటికి వచ్చాడని – ఇక్కడకు రాకుండా ఒక్కరోజుకూడా ఉండలేని వ్యక్తి ఆ మిత్రుడి ఆకర్షణలో పడి అయిదారురోజులు ఎలారాలేదా అనుకున్నాను. గౌహర్ తరువాత చెప్పాడు– నామిత్రుడికి ప్రపంచంలో నా అనేవా రెవరూ లేరు అని – నీపేరు అడిగాను. అతను చెప్పగానే ఉలిక్కిపడ్డాను – నిజంగా స్త్రీలు పేరువినే ప్రేమిస్తారు – నిన్నసాయంత్రం నువ్వు వచ్చావు. కాని ఈనాడు ప్రపంచంలో నాకంటే ఎక్కువగా నిన్నెవరూ ప్రేమించటంలేదు. పూర్వజన్మ అనేది తప్పకుండా ఉన్నది. లేకపోతే ఇదెలా సంభవం ?" అంటుంది ఆమె – ఇంత స్వల్పమైన కాలంలో– ఇంత స్పష్టమైన భాషలో స్త్రీ ప్రణయ నివేదన కథ ఇంతకు పూర్వం ఎప్పుడూ పుస్తకాల్లోనూ చదవలేదు 'చెప్పకోటమూ వినలేదు – అది నటన అనటానికి వీలులేదు.

కమలలత చూడటానికి అందకత్తె, చదువుకున్నది. ఆమె సంభాషణ, అతిథి సేవ, ఆదరం అనన్య సామాన్యం – ఆ వైష్ణవి ఆవేదనలో అశ్రువులలో అకుంఠితమైన ఆత్మ ప్రకాశం నిండిపోయి ఉంది – వయసు యవ్వనం తొలూకు అంచుల్ని అధిగమిస్తున్న ఈ సమయంలో అయాచితమైన–

నారీ అంతర్యం నామీద వెల్లువగా ప్రవహించింది. ఎక్క డికి పారిపోయి ఆత్మరక్షణ చేసుకోను ? అనుకుంటాడు శ్రీకాంత్.

పురుషుడైన వాడికి యువతి అయిన స్త్రీ తాలూకు పరిణయ నివేదన ఇంత అరుచికరం అవుతుందని వూహిం చనుకూడా వూహించలేక పోయాను – అని విస్తుపోతాడు అతను.

శ్రీకాంత్ అనే పేరునినే ఆమె ప్రేమించింది.

ఏకాంతంగా ఉన్నా ఆమె స్త్రీత్వం – రసికత్వాన్ని అనుభవించలేని స్త్రీత్వం – భావవిలాస సామగ్రిని కూర్చుకో లేక అలసిపోయిన ఆమె స్త్రీత్వం – మూసివేసిన గత జీవిత ద్వారాన్ని ఒక్కసారిగా తెరుచుకుని బయటకు దూకింది. శ్రీకాంత్ అనే చుక్కానితో తన జీవితనౌకని రాగజలధిలో వదిలి వెయ్యాలని తపించి పోయింది.

శ్రీకాంత్ ఆమె ప్రేమను అరిగించుకోలేక పారిపోవా లని ప్రయత్నిస్తాడు – ఆసంగతి ఆమెకు తెలుసు – అందుకే ఆ సాయంత్రం తన కథ అతనికి చెప్తుంది – ఆకథ ఏమీ లేదు- ప్రతి చరిత్రహీనురాలి జీవితంలాంటి జీవితమే ఆమె దీని – అయితే ఆమె ప్రేమించి నమ్మినవాడు ఆమెని వది లించుకోటానికి ఆమె సోదరుడిలాంటి వ్యక్తితో ఆమెను హీన పరుస్తాడు – అవమానం భరించలేని అతను ఉరిపోసుకుని చని పోతాడు – అసలు ప్రేమించినవాడివలన ఆమె తల్లి కావ టానికి సిద్ధంగా ఉంది. డబ్బుకోసం అతనువేసిన ఈ అప

నింద విని అతన్ని అసహ్యించుకున్న కమలలత — బంధు మిత్రుల్నీ తల్లిదండ్రుల్నీ విడిచి వైష్ణవి అయిపోతుంది.

కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్న తండ్రిని చూసి "నేను బ్రతికిలేను నాన్నగారూ మీరు వెళ్ళండి" అని పంపివేసి సన్యాసులతో కలిసిపోయి ఆ అసూర్యంపశ్య ఆ అందాల సుకుమారి — సన్యాసిని అయి చెట్లకింద రోజులు గడిపివేస్తూ ఉంటుంది — చివరికి శ్రీకాంత్ నిచూసి నిజంగా ప్రేమించింది — వైరాగ్యంతో నిండిపోయి విరక్తితో నిండిన ఆమె హృదయం తిరిగి రాగరంజితం అయింది — "ప్రభూ! నేను నీదాసిని. మనిషి అంటే ఇంత ప్రగాఢమైన అసహ్యతని మనస్సులోంచి పోగొట్టు — లేకపోతే నా సాధన అంతా వ్యర్థమైపోతుంది" అని భగవంతుడిని ప్రార్థించే సంస్కారం ఆమెది. "అహంకారం చచ్చికూడా చావదు గోసాయీ! ఆర్పినా ఆరిపోని నెల్లుమంట లాంటిది అది" అనగలంత వేదాంతిని ఆమె.

"యదార్థం యొక్క స్థానాన్ని అబద్ధం ఎప్పుడూ ఆక్రమించలేదు. వారికి స్పష్టంగా కనిపించదు కనుక — వారు సరిగా తెలుసుకోలేరు కనుక వారి ఆంతర్యం ఎప్పుడూ దుఃఖభయంగానే ఉంటుంది — ఈ మార్గం సత్యంగా కనపట్టని వారి సాధనంతా నీటి ప్రవాహం అడుగున ఇసుకలాగ భిన్నభిన్నంగానే వుందికాని ఎప్పుడూ సమ్మిళితం కాదు" అనగలిగినంత ప్రపంచజ్ఞానం ఆమెది.

అయితేనేం? ఆమె దైవోపహతురాలు — శాపగ్రస్తమైన తన జీవన సౌధం తాలూకు కిటికీలు ఒక్కటికూడా

మాట్లాడకుండా వాదించకుండా ప్రపంచాన్ని పరికిస్తూనే ఉంది కమలలత.

"మీకూ మాకూ ప్రేమస్వభావమే వేరు - మీరు ఆధిక్యాన్ని కోరతారు. మేము గాంభీర్యాన్ని కాంక్షిస్తాము- మీరు ఆనందాన్ని అభిలషిస్తారు - మేము స్థిరత్వాన్ని వాంఛిస్తాం" అంటుంది కమలలత - ఆమె గొప్ప వక్త.

"ప్రాణహీనమైన నిర్జనమూర్తికి వ్యర్థమైన సేవ చేయగా చేయగా రెండు రోజుల్లోనే అలసిపోతాం - ఒకవేళ ఇదివరకు నన్నెవరైనా ప్రేమిస్తే ఆమెను నువ్వు మరచిపోతావు - కాని ఆమె నిన్ను మరిచి పోలేదు - అంతేకాదు ఎన్నడూ ఆమెకన్నీరు ఎండిపోవటం అంటూకూడా ఉండదు" అంటుంది శ్రీకాంతతో.

ఆ మరునాడు శ్రీకాంతు వెళ్ళిపోతాడు- వెళ్ళిపోతూ:

"జీవితంలో అనేక బాధల్ని దుఃఖాల్ని అనుభవించావు నువ్వు—ఈసారిఅయినా సుఖంగా ఉండు కమలలతా" అని ఆశీర్వదిస్తాడు

ఆమె నవ్వి "నేను సుఖంగానే ఉన్నాను గోసాయీ! ఎవరి పాదపద్మాలమీద ఆత్మార్పణ చేసుకున్నానో వారు ఈ దాసిని ఎన్నటికీ పరిత్యజించరు" అని సమాధానం ఇస్తుంది

ఆమెను గురించి శ్రీకాంతుచేత ఇలా అనిపిస్తాడు శరత్ - రాజలక్ష్మినీ, ఆమెనీపోల్చి.

"రూపంలో, నియమాల్లో, అధికారంలో అతి కఠోరమైన ఆత్మసంయమనంలో సునిశిత బుద్ధి అయిన రాజలక్ష్మి

ముందు—ఈ స్నిగ్ధ సుకోమల స్వభావిని కమలలత ఏపాటిది ? కాని ఆమె ఈ స్వభావంలోనే నేను నా స్వభావాన్ని దర్శించ గలిగాను — నా ప్రతిబింబాన్ని గుర్తించ గలిగాను" అని.

చాలామంది శరత్ బాబే శ్రీకాంతుగా తనని తాను చిత్రించుకున్నాడంటారు — అలాగే ఏ స్త్రీ ఆ మహారచయిత మనసులోవున్న కోమల ప్రదేశాన్ని స్పృశించగలిగిందో ఆక్షణం చాలా గొప్పది, చాలా అమూల్యమయింది.

కమలలత పాత్ర ఆయన సృష్టించిన ఒక రంగు రంగుల ఇంద్ర ధనస్సు. ఆయన స్త్రీలందరూ చరిత్రలేనివారనీ, అందరూ ఒకమాదిరి వాళ్లేననీ — చివరికి అందరూ చచ్చి పోవటమే జరుగుతుందనీ అంటారు. నిజం చెప్పాలంటే కమలలత పాత్ర స్త్రీత్వంలోని వైవిధ్యానికి — స్త్రీత్వంలోని వైచిత్ర్యానికి ఏకైక చిహ్నం. అది ఒక అపూర్వ సృష్టి.

ఆమె శ్రీకాంత్ ని ఎంత ప్రేమించిందో — భగవంతుడిని అంత ఆరాధించింది — ఆమె బుద్ధి ఎంతవిరాగినో ఆమె హృదయం అంత రాగరంజితం — ఆమె సకలబంధాల్ని ఎంత నిముషంలో తెంచుకోగలిగిందో అంత నిముషంలో మరో కొత్త సంకెలని తనకి తగిలించుకోగలదు—ఇంతకన్న అపూర్వమైన — ఇంతకంటె ఉజ్వలమైన మరోస్త్రీమూర్తి మనకి శరత్ సాహిత్యంలో దొరకదు.

రాజలక్ష్మి శ్రీకాంతుతో కమలలతని గురించి ఇలా అంటుంది. "ఏ సాధనాబలంతో మమ్మల్ని పొందగలిగిందో —దానివల్లనే భగవంతుడు కూడా లభిస్తాడు" అని.

"ఎక్కడో ఈ కమలలతంటే భయపడుతున్నాను" అంటుంది. అది అసూయకావచ్చును, కాకపోతే ఇంతవరకు తనవాడుగా ఉన్న శ్రీకాంతు ఆమెను ఆరాధించటంవలన తన అహం దెబ్బతినటంవల్ల కావచ్చును – ఏది ఏమయినా ఇహలోకంలో ఒక మనిషిని ఆరాధించడమే – పరలోకంలో భగవంతుడిని పొందటానికి మొదట మెట్టు అనే విషయాన్ని శరతుబాబు మనకి తెలియ జేస్తున్నారు.

తరువాత రాజ్యలక్ష్మి, శ్రీకాంతుకలిసి కమలలతని చూడటానికి తిరిగి మఠానికి వెడతారు – ఆ రోజుల్లో కమల లత శ్రీకాంతుకి దూరంగానే ఉండి రాజ్యలక్ష్మి హక్కుని భగ్నం చెయ్యదు – తరువాత వాళ్ళు వెళ్ళిపోతారు.

అయినాకూడా శ్రీకాంత్ కమలలతని మర్చిపోడు – పరమ ప్రేమికురాలు రాజ్యలక్ష్మి సమక్షంలో కూడా నిరా శ్రియురాలు కమలలతే అతని స్మృతిపథంలో పయనిస్తూ ఉండేది–చివరకి గౌహర్ని చూడాలనే నెపంతో శ్రీకాంత్ బయలుదేరి మురారిపురం వస్తాడు – గౌహర్ అప్పటికే చనిపోయినాడు–చనిపోతూ కమలలతకి తన డబ్బు ఇమ్మని శ్రీకాంతుకి ఒక ఉత్తరం వ్రాసి ఆ ఉత్తరమూ, డబ్బూ నవీన అనే సేవకుడికి ఇచ్చాడు గౌహర్.

శ్రీకాంత్ అవి తీసుకుని కమలలత దగ్గరికి బయలుదేరి వచ్చాడు. ఇప్పటికే మహమ్మదీయుడైన గౌహర్కి జబ్బు సమ యంలో సేవచేసిందని ఆమెను మఠంలోనివారు వెలివేస్తారు– శ్రీకాంతుని చూడగానే ఆమె సంతోషించి :

"నీకోసమే ఉన్నాను ఇక వెళ్ళిపోతాను" అంటుంది.

గౌహర్ ఇచ్చినడబ్బు తీసుకోమంటాడు శ్రీకాంత్ – "నేను భిక్షుకిని. డబ్బు ఏం చేసుకుంటాను? నాకు అక్కర్లేదు" అంటుంది.

శ్రీకాంత్ కళ్ళల్లో నీరు తిరుగుతుంది.

"కళ్ళనీళ్ళు దేనికి గోసాయీ! ఎవరి శ్రీచరణాల మీద ఆత్మసమర్పణ చేసుకున్నానో వారు నన్నెప్పుడూ విడిచిపెట్టరు. ఎక్కడికి వెళ్ళినా వారు నాకు ఉంటారు. నాకోసం ఆలోచననూ, దుఃఖాన్నీ పెట్టుకోవద్దు" అంది.

రెండోచీరకూడా తీసుకుని వెళ్ళలేదు ఆమె—శ్రీకాంతు ఆమెను రైలుస్టేషనులో కలుసుకుంటాడు – సర్వమూ విడిచి పెట్టి వెడుతున్న ఆ సన్యాసిని ఒక టికెట్ కొనిపెట్టు అని శ్రీకాంతుని యాచిస్తుంది.

శ్రీకాంత్ ఆమెతోబాటు కలకత్తాదాకా ప్రయాణం చేస్తాడు. కలకత్తాలో సేవకుడు స్టేషన్‌కి వచ్చి శ్రీకాంతు సామాను దింపివేస్తాడు. అప్పుడు కమలలత నిశ్శబ్దంగా చేతులు జోడిస్తుంది – శ్రీకాంతు ఇలా అంటాడు–

"నేను నిన్ను భగవంతుడికి అప్పగించాను–నీ భారాన్ని ఆయనే వహిస్తాడు — నీ మార్గం, నీ సాధన నిర్విఘ్నం అవుతాయి–నాదానివని చెప్పి నీకు నేడు అగౌరవం కలిగించను."

అంతే. నవల అయిపోయింది – శరతుబాబు శ్రీకాంతులో రాజలక్ష్మికన్న కమలలతకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చాడు.

అప్పుడు మనకి అనిపిస్తుంది – సేవకుడురాకుండా ఉంటే అతనుకూడా కమలలతతో వెళ్ళిపోయేవాడేమోనని.

రాజలక్ష్మికి శ్రీకాంతు చేయూత అవసరం లేదు — శ్రీకాంతుకే రాజలక్ష్మి చేయూత కావాలి. కమలలతకి అలాకాదు. ఆమెకి శ్రీకాంతు చేయూత కావాలి—అమిత మైన ఆత్మబలం ఉన్నది కనుక కమలలత ఒంటరిగా వెళ్ళి పోయింది.

శరతుబాబుకి విషాదాంతాలంటే ఉండే వ్యామోహం వలన కమలలతని ఒంటరిగా పంపాడు. నేనయితే శ్రీకాంతుని కూడా ఆ వియోగినివెంట నీడగా పంపించి ఉందును—అప్పుడు ఆ నవలకి మరింత పటిష్టత చేకూరి ఉండేది - కాకపోతే ఒకటి జీవితంలో అలా జరిగిందేమో! జరిగినాసరే ఆ చిన్న మార్పువల్ల కథ మహోన్నతంగా ఉండేది - ఎలా అయినా కమలలతని మరచిపోవడం మాటలు కాదు - ఆమె దేవత.



# విశ్వనాథవారి 'కిన్నెరసాని'

ఒక మధుర కంఠస్వరం - అంతకన్నా మహా మధుర మైన మరో లేఖిని కలిస్తే అందులోంచి ఎలాటి మధువాహిని ప్రవహిస్తుందో - ఎలాటి దివ్య లోకాల వాకిలి తెరుచుకుం టుందో నేనెలా వర్ణించటం ?

ఓహో! కిన్నెరసాని వూహామాత్రములోపల ఏల నిలవవే జవరాలా ! నీనవ్వులు నురుగులుగా - నీవళులవి తర గలుగా - నీ కన్నులు మీనులుగా నీకరణిని ప్రవహించెదు.

ఓహో కిన్నెరసాని - మహాగాయకుడు శ్రీ బాలమురళీకృష్ణ పాడిన పాట తరగలుగా, నురుగులుగా తురిగిపోతూ మధు వాహినిగా ప్రవహిస్తున్నది.

ఎలా నమస్కరించాలి శ్రీ విశ్వనాథవారికి ? కిన్నెరని సృష్టించినందుకు - మహా రచయిత మనస్సు చాలా విలక్షణ మైనది. దాని సృష్టి అద్భుత మైనది-అత్తగారి పోరు భరించ లేని కోడలు దుఃఖంతో చెలవరై పోవటం భర్త ఆమె వియోగానికి వ్యధ పడటం - ఆమెకూడా తన కోపానికి తెలివితక్కువకీ విచారించటం ఇందులో వస్తువు-ఎక్కడో కిన్నెర అనే పేరుతో ఉన్న యేటిని చూచి కవి హృదయం పొంగిన పొంగులే ఈ కిన్నెరసాని పాటలు కిన్నెర నడకలు గురించి.

తాను నదిగా నేలనై నానంచు లోన-పూని కిన్నెర సాని పొగిలింది పొగిలింది - ముక్త గీతికవోలె మ్రోగింది మ్రోగింది అని తాను మానుసి అయివుండగ తన పతి లాలన గురించి - నేను కోపమునంది నీ ప్రక్కనుండగా వల దన్నకొద్ది నా పదము లొత్తుచు నీవు తెలచి కవుగింటిలో తేర్చుకుంటూ నీవు - నారొమ్ము తల చేర్చగారావు కా బోలు - తలిరాకువంటి మెత్తని ఎర్రపెదవితో తీర్చి నామోము నద్దగ రావు కాబోలు - నా యొడలు మిపుల అందపు కుప్పయని చెప్పి ఎల్లతావులను ముద్దిడరావు కాబోలు.

అని దుఃఖిస్తుంది. తరువాత జలదేవికలువచ్చి నారి ఏరుగా మారిన తదుపరి మమతలేలనే జవరాలా అని తొందర పెడతారు. వెళ్ళలేక, ఆగలేక, విలవిలలాడి పోతుంది కిన్నెర.

కానీ పోకతప్పదు. అక్కడ శ్రీ విశ్వనాథవారి వర్ణన చూడండి—

ఏమి కిన్నెరసాని, ఏమి కిన్నెరతోగు, తెలివాకా కల వెంట వెలుగులా తోచింది. తలిరు పూవులవెంట తావిలా తోచింది. తె లు గు పా ట ల వెంట తీపిలా తోచింది. బ్రి తి కి యు న్న ప్పు డు ఎంత ఒయ్యారియో, అంత యుల్లాలితనమూ చూపింది. యిప్పుడు వియోగం నారికి భరిం చలేని బరువే అయితే ఆమె బ్రతుకూ, మమతా కూడా సెల యేరై పారుతుంది. కెరటాలై విరుగుతుంది. మిగిలేదేమిటి? ఏమీ లేదు.

అలా వియోగిని అయిన కిన్నెర ప్రవహిస్తుంటే అదే నాట్యంక్రింద మారుతుంది. అక్కడ తెలుగు వాక్యాలతో నాట్యభంగిమలు చిత్రించారు కవి. చూడండి, నాట్యాను కూలమయిన ఈ వాక్యాలు—

కెరటాలలో సుర్వు – తెరచాలులో నీటి – పార జాలులో కిన్నె – రటుకదలి, ఇటుకదలి చిరుగాలిలో నూగు తొలవంపులో నీటు, తరితీపులో కిన్నెరటులేచి, ఇటు తేచి.

వడి నీటిలో మేలి జడసందులో నీటి ముడిపొందులో కిన్నె రటుపొంగి, ఇటుపొంగి.

సొనజారుతూ, నీటి పసలాలుతూ, అందమున పోలు తూ, లయ పెంచుతూ, మధ్యలయందించుతూ, పాట రయ మెంచుతూ, కిన్నెర నృత్యం చేస్తూంది. ఆ వాక్యాలే ఆమె నృత్యానికి చాలు.

స్త్రీ హృదయం ఎంత సమస్య? ఎంత చిక్కుముడి? ఆ వియోగినిలో కళాపిపాస కళాప్రవాహం దుఃఖంకూడా అందంగానే సాగాలి. తెలిపూలతేనెవాకలుగా పోలాలి. అదే నేమో మానవత్వానికీ మమతకీ ఉన్న సంబంధం!

అంతేకాదు. ఆమె సంగీతం పాడుతుంది. తలిరాకు సన్న మెత్తని అందమునబోవుతరుణి కిన్నెరపాట తానమందుట చూసి ఎడదలో ఆనందజలధితో లోకాలు పులకితమ్మయి పోయెనో? అయ్యేను కాబోలు, కళామూర్తి కిన్నెర వాగైనా తన స్వభావాన్ని విస్మరించలేదు. పాడుతూనే, దుఃఖిస్తూనే విధి తనను ప్రవహింపచేసినంత మేరా, ప్రవహిస్తూనే వుంది. ఆ ప్రవాహ సౌందర్యానికి ముగ్ధుడైనాడు. 'చపలుడైన కడలి మరో ఏటిచాన తన కవుగిలికి రానున్నదని పొంగిపోయినాడు. కాముకుడూ, గంభీరుడూఅయిన మగవాడి దక్షిణ నాయకత్వాన్ని ఎంత మనోహరంగా వర్ణించారో విశ్వనాథ.

గాలిపిల్లలైపోయి ఊదెనో, మొగిలికన్నెలై బోయి చెప్పెనో, తగని కోరికచేత తనలో కడలిరాజు — సొగసుకిన్నెరని చూడాలనిపించి పొంగిపోతాడు. సంతోషమే మేనై తొంగిచూస్తాడు. అదీవరకే అతనికెందరో నదీచానలు ప్రియురాళ్ళు అయినా యిన్ని ఏళ్ళొచ్చి చిన్న వాగునుచూచి వలపుకొంటాడు కడలి.

ఎంతటి వ్యామోహం? ఎంతటి తృష్ణ? తాను సామాన్యుడుకాడు, తాను చెలియలికట్ట దాటగారాదు. నలుగురిలోనూ తిరుగనేర్చిన తాను మరో స్త్రీకోసం ఆశించటం పరువుతక్కువేమో ' అని ఆలోచించలేదు అతను. ... అత

నేమిటి? ఏ మగవాడూ ఆలోచించడు. కెరటాలు పొంగి తరగ లూగాడి పొంగిపోతాడు వాంఛతో.

కడలి మిన్నుల తాకు చూసింది కిన్నెర కడలి తరగల వూగు చూసింది కిన్నెర. అతడు తన మేన మైకమయ్యెనని ఎరిగికొన్నది. పోకుండా ఉండాలని ఎంతో ప్రయత్నం చేసినది. కడలి పారెడు నీరు గడ్డకట్టాలని కోరింది. సాగిపోయెడి నీరు యింకిపోవాలని ప్రార్థించింది. మహాయిల్లాలు కిన్నెర అమితంగా దుఃఖిస్తుంది. ఆ దుఃఖాన్ని చిత్రించటంలో సత్యనారాయణగారి లేఖిని మరో సౌధాగ్రం అధిష్ఠించింది. దుఃఖానికికూడా ఒక ఆకారం ఉంటుంది. అది స్పష్టంగాకూడా ఉంటుంది.

వూగులాడు కెరటాల నాపుకొన — సాగులాడు తరగల్లు నిలుపుకొన — పారిపోవు తన గుణము చంపుకొన — చాలకీ, చాలక, చాలక, "హా" యని కిన్నెర దుఃఖిస్తుంది.

ఏడ్చి, ఏడ్చి జలమెల్ల ఎర్రనయి, ఏడ్చి ఏడ్చి తనువెల్ల నల్లనయి — ఏడ్చిఏడ్చి నురుసుల్లు తెల్లనయి, ఏడ్చి ఏడ్చి నడకల్లు వేగమయి.

ఎంత శాపం ఇష్టంలేని సంయోగం? ఎంత పాపం చేసుకుంటే అది అనుభవించాలి ... కానీ స్త్రీ అయినాక జీవితములో ఎప్పుడో అప్పుడు తప్పని యిష్టంలేని కలయిక నీరుగా మారినా కిన్నెరకు తప్పలేదు.

ఆమె వేదన మరో స్త్రీ కనుక, గోదావరి అర్థం చేసుకున్నది. తన ప్రియుడి చాపల్యాన్ని అర్థమూ చేసుకున్నది. గోదావరీనది పొంగివచ్చి కిన్నెరకు ఆశ్రయ మిచ్చింది ఆ

మాత్రం లాలనకే పొంగిపోయింది కిన్నెర లెతహృదయం. ఆమె సుందర హస్తాలకు తన చిన్నారిఅలలచేతుల్ని అందించి శరణు కోరింది. ప్రణమిల్లింది.

గోదావరి కదలిపోయింది. నారీ అంతర్యం మరో నారికే అర్థం అవుతుంది కాబోలు.

విశ్వనాథవారికి గోదావరి అంటే ప్రత్యేకాభిమానం ఉన్నదేమో! అనిపిస్తుంది. ఉదాత్త నాయిక అయిన మహారాణి గోదావరి. అందుకే ఆమె జాలిగుండె గూడులు కదిలినాయి. కిన్నెరకు ఎదురుబోయి ఆదరంతో కవుగిట జేర్చుకొని నీ దిగులు యిక మాను చెల్లీ అని ఓదారుస్తుంది.

గోదావరీదేవి గొప్పవంశపు రాణి. కాదనేందుకు వీలు లేదు. ఆమె కాదన్నపని సేయగరాదు. ఆమె కిన్నెరని తనలో కలుపుకొని, కడలి జారిని పడనీదు. ఓ దొరా నీ కిది తగదు అని కడలిని చివాట్లేస్తుంది.

అది విని తన పొంగు మైదించుకొని తను లోదించుకొని, మీదిపొంగు కుదించుకుని పోతాడు కడలి. తన చాపల్యానికి తానే సిగ్గుపడతాడు. అక్కడినుండి కిన్నెరకంతా వైభవమే. కిన్నెరకంతా సౌభాగ్యమే. తా నిప్పుడు చిరంజీవిని. తా నిప్పుడు అమరవాహిని. తానొక అమృత స్రోతస్విని. ఇక ఆమె అందాల్ని వర్ణిస్తారు కవి.

వివిధ కాలాలలో కిన్నెర వెలుగుల్ని, మెరుగుల్ని వర్ణిస్తారు కవి. సీటి పుట్టము తొలగి, నిలువెల్ల నిప్పులో యేటి యిసుకలోనుండి ఎగిసిపోతుంది గ్రీష్మంలోకి కిన్నెర

వడగళ్ళతో వానాకాలం వస్తే, పుడమి పచ్చికలతో పొంగిపోతే, అతిప్రేమ వారి దేహమెల్ల నిండగా మురిసినది వర్ష కిన్నెర.

అంచ రెక్కలతోడ శరత్తు అరుగు తేరగా, మొదలిపొండులు పోయి పోనుపోను స్వచ్ఛమై తేరుకున్నది శరత్కిన్నెర.

దిశదిశలా మంచులో తేలించుకొనగా, తెల్లనై తరగల్లు తేలించుకుంటూ, వెండితీగె విధాన వెలిగిపోతుంది సీత కిన్నెర.

రాలి ఎండిన యాకులోని పడి నీరముల్ మూగి రొరలని కొత్త మధువు కాలువ యట్లు తోచింది శిశిర కిన్నెర.

ఈ విధంగా ప్రయాణించిన ఆ యేటి దొరసాని రాము పాదారవిందాలవద్ద తన జన్మ ధన్యంచేసుకున్నది.

ఇదీ కిన్నెరసాని, మహారచయిత విశ్వనాథవారి అపూర్వ సృష్టి. అది తెలుగు సత్కవిరాజు పలుకు. దానిమాధుర్యానికి అవధులూ లేవు, దాని మనోహారతకి హద్దులూ లేవు. మహా రచయితల స్త్రీ సృష్టిలో మరపురాని పటియిల్లాలు కిన్నెర. జారిపోని మధురస్మృతి కిన్నెర.



# మల్లాదివారి 'స్త్రీపాత్రలు'

వీణ మోగింది. వాణి వెలసింది—రామలింగడు కన్నెత్తి చూశాడు. వాణి నవ్వింది— రామలింగడు లేచి కూర్చున్నాడు—మళ్ళీనవ్వింది వాణి. రామలింగడు ముక్కు మీద వేలువేసుకుని నీకేమవుతుంది? అంటాడు.

నేను వాణిని దివ్యధీమాతో పలికింది వాణి—అంటే? అన్నాడు అతను. నేను సరస్వతిని. భాషాదేవిని. నన్ను పట్టుకుని అది నీకేమవుతుందని అవమానిస్తావా? అని అరచింది ఆమె.

"నిన్ను ఏమీ ఈసడించలేదమ్మా — ఆడదానివమ్మా అన్నాను. కాదని గదమాయిస్తే నీకే నష్టం. అంటాడు రామలింగడు.

ఇలా ప్రారంభమవుతుంది. ఆలాపన అనే పేరుతో మా గురువుగారు శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు వ్రాసిన కథానిక. రామకృష్ణ శాస్త్రిగారు మహారచయిత. సునిశితమైన హాస్యంతోనూ, అద్భుతమైన సత్యంతోనూ ఆయన రచించిన కథానికలు ఉజ్వల దీపశిఖలు—ఆయన కథలు అర్థంకావాలంటే బహుముఖ పాండిత్యంతోపాటు లోక జ్ఞానం కూడా అవసరం.

రామలింగకవి నిరసనకి ముచ్చెమటలూపోసి కళ్ళ నీళ్ళు తిరిగి "నేనెవరో పోల్చుకోరాదా? ప్రణమిల్లరాదా" వాణీ వీణానినదం నాగరలోక ప్రసిద్ధమేకదా పెద్దన్నగారి పద్యం అయినా చదువలేదా? అంటుంది వాణి.

"సరిపోయింది. తాతయ్యా పద్యమూ నీకూ నీ విద్యకూ తార్కాణం. పెద్దన్నగారు ఒట్టి అమాయకుడు. తెల్లనివన్నీ పాలు అని నమ్మేరకం. ఇక వెళ్ళవమ్మా మీ ఆయనకు మెలకువ వచ్చి పక్క తడుముకుంటే - చేసుకున్న ఇల్లాలంటూ ఉన్నతరువాత ఆ వయసులో చేతికయినా తగలకపోతే మరీ ఉసూరు మనడూ!" అంటాడు రామలింగడు.

ఆ తరువాత పినవీరన్న ఇంటికి వెడుతుంది వాణి. అక్కడా అవమానమే ఎదురయింది. "సర్వాశుక్లా ఈ సరసం చాలిద్దామా!" అంటాడు అతను. ఆ తరువాత పోతన దగ్గరికి వెడుతుంది.

ఇక్కడినుంచి ఎక్కడికమ్మా అని వగరుస్తూ అడిగిన హంసకు "అడిగావ్ శకునపక్షి! ఎక్కడికైతే నీకెందుకు? ఎగరమన్నప్పుడు ఎగురు, వాలమన్నప్పుడు వాలు" అని విసుక్కుంటుంది వాణి.

ఈ కథని రామకృష్ణశాస్త్రిగారు వ్రాసినప్పుడు అంతా విమర్శించారని అంటారు. కాని ఇందులో చాలా సత్యం మాత్రమే కాదు, సునిశితమైన హాస్యం కూడా ఉంది—లోకం అంతా అవినీతి వ్రాస్తాడని చలాన్ని ఆడిపోసుకునే రోజుల్లో అదే అవినీతిని శాస్త్రీయంగా వ్రాశారు రామకృష్ణశాస్త్రి గారు —సహజమైన జీవితంలో అవినీతి పడుగులా అల్లుకుపోయే ఉంటుంది— అంతేకాదు అందులో అమితమైన కరుణతోపాటు అపరిమితమైన హాస్యం కూడా ఉంటుంది—ఆ హాస్యాన్ని చిత్రించటంలో రామకృష్ణ శాస్త్రిగారు అతి చతురులు— చివురు వెన్నెల అనే వారి కథలో వచన కవిత ఎలా

ఉండాలో చూపి యువ రచయితలకు మార్గదర్శకు లయినారు ఆయన.

చిరంజీవి చిక్కు విరుపాజిని వర్ణిస్తూ ఇలా అంటారు— వెన్నెల సానబెట్టిన మంచుచినుకల్లే — పూరేకులు మలచిన పుష్పావడి పుణికల్లే — మిరుల సిరులున్న మహాశ్వేతల్లే — తామర వెల్లతనువు కల్గిన శారదల్లే — పాలకడలి కడుపు పొంగల్లే — ఉన్న దట ఆమె. ఈ కన్నె ఆయన కలల్లో మెదలిన తెలుగు సృష్టి.

మేనక అనే మరోకథలో— జీవితంలో ఏర్పడిన మొనాటనీని సహించలేని ఒక వేశ్య తాతగారి నౌకాయనని తోడుతీసుకొని దేశయాత్ర బయలుదేరి — కొంతవరకూ సంఘాన్ని సంస్కరించి తిరిగి కొంప చేరడం వస్తువు— శాస్త్రి గారి స్త్రీ పాత్రలన్నీ పరమ గయ్యాళిగా ఉంటాయి — సంఘం మీద ఆయన అంతర్యంలో ఉన్న అసహ్యాన్ని ఇలాటి స్త్రీలని సృష్టించి వారి ద్వారా తిట్టించడంతో తీర్చుకున్నారా అనిపిస్తుంది

ద్విపద అనే కథలో నాయిక ఆధునిక సుగాత్రి. ఆడ వాళ్ళకి సహజ సౌందర్యం లేదేమో'అని భయపడే అర్భకుడికి భార్య

అల్లో నేరేడులో సీతమ్మ మహా ఇల్లాలు. మగనిచేత అనుమానించబడి మరుగై పోయిన మానుషవంతురాలు.

శిక్రావల్లి అనేకథలో— ఒక స్త్రీని గురించి ఇలా అంటారు రామకృష్ణశాస్త్రిగారు—ప్రకృతికి ఎదురీతగా బ్రతికే తత్వం— మనసుకూ దేహానికీ ఒకదానికొకటి తీసిపోని స్వాతంత్ర్యాన్ని ఇస్తుంది. అంటూ ఆ స్త్రీ పతనానికి కారణాలతో

పాటు సానుభూతి కూడా చూపిస్తారు... కాని చదివేవారికి మాత్రం నవ్వే వస్తుంది.

గృహిణిపదంలోతనని తిడుతున్న ఇల్లాల్ని చూసి నేరం వప్పేసుకున్న భర్త "నిజమే నేనూ ఏదో ఆడపిల్లని వరించటం మానేసి మా మేనత్త కొడుకుని చేసుకున్నట్లయితే బాగుం డేది, ఇద్దరం సైకెళ్ళెక్కి తిరుగుతూ సినిమాలకు వెళుతూ మరీ హాయిగా ఉండేవాళ్ళ" అంటాడు. ఆ గృహిణి సర్వజ్ఞ రాలు. భర్తని వాదించి గెలవగల ప్రౌఢ– అప్పయ్య దీక్షితు లకి పళ్ళులేవుగనుక చప్పని కవిత్వం వ్రాశాడని నిరూపించిన వాదన– విశారద.

అది అలా ఉంచి రామకృష్ణ శాస్త్రిగారు సృష్టించిన అద్భుత స్త్రీ కనక జానకి– అక్రమ ప్రణయంలో అధికారం కావాలని కోరే తన ప్రియుడికి జీవిత చిత్రాన్ని వినిపించిన వాస్తవిక చిత్రకారిణి.

బూతుకు నీతి ఏమిటి? మీ బులిబుచ్చికాలు నమ్మే నంగనాచినికాను– మీరాడే మాటే నే పాడే పాట కాదు అని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పేస్తుంది– పొందలేని సుఖాన్ని పొందగలిగినచోట అందిపుచ్చుకుని పొందిన ఫలి తాన్ని చెయిజార్చుకోని లౌక్యరాలు లోకానికి జ్ఞాన నేత్రా లేకాని అవసరం వచ్చినప్పుడు అసలు కళ్ళు మూసుకు పోతాయి అని వ్యాఖ్యానించగల సాహసురాలు.

ఆమెను గురించి శాస్త్రిగారి వర్ణన చూడండి – పల్లె టూరి పడుచుకు అంత ప్రౌఢతనం– అలా పలుకుతూంటే వగలై చిలికే రసాలు– అంతేకాదు చెంపమీద ఎరుపు చెరగ

సీయని మహా రసికురాలు. బ్రతుకంతా రాగరంజకం చేసు కున్న ప్రౌఢనాయిక— తనకి చేతనయిన పద్ధతిలో జీవన గమనం దిద్దుకున్న విచిత్ర స్త్రీ.

ఆమె చేస్తున్నది తప్పే కాని శాస్త్రిగారు చిత్రించిన తరహాలో తప్పేమిటి? అది తెలివిగలది అనిపిస్తుంది— నిజమే అలా చేయటంలోనే గొప్పతనం ఉందేమో!.. ఒకవేళ గొప్పతనం కాకపోయినా బ్రతకనేర్వటంలో తీరు అదే. తల్లితండ్రులూ, లోకం అన్యాయంచేస్తే తను దిద్దుకుని సుఖిం చటంలో ఆమె సాహసం ఇంతా అంతాకాదు.

రామకృష్ణ శాస్త్రిగారు చాలా వరకు తమ కథల్లో చిత్రించిన స్త్రీ లందరూ ఇలాగే ఉంటారు— ఒక విధమైన విప్లవం, తిరుగుబాటు స్వభావం వాళ్ళల్లో గోచరిస్తుంది— అదే సంఘటనలో అపరమితమైన జాలీ వేస్తుంది వాళ్ళమీద. అంతేకాదు, విపరీతమైన నవ్వుకూడా వస్తుంది— ఇంత తేలిక అయిన జీవితంలో ఇంత హాస్యం ఎలా సృష్టించ గలిగారు ఈ మహారచయిత అని విస్తుపోతాం. తప్పదు— అన్నిటి కంటె అందం ఆయన భాష. అసలైన అచ్చ తెలుగు— అన్న మాచార్యులవారి అందాల తెనుగు— తనని తాను నవనాగరి కంగా అలంకరించుకుని శ్రీ రామకృష్ణశాస్త్రిగార్ని ఆశ్ర యించింది.

నిన్నరాత్రి కలమాత్రం వచ్చింది. నీవు రాలేదుగదే జవరాలా— అంటాడు తాతగారు... ఆయన కథలలో స్త్రీ పాత్రలన్నీ ఒకయెత్తూ, అమ్మమ్మ ఒక్కతి ఒకయెత్తూ. ఆవి డంటే తాతగారికి ప్రేమ. ఇల్లాలిలో ప్రియురాలిని చూస్తారు.

తాతగారు. పండు ముత్తైదువఅయిన భార్యలో స్త్రీనిదర్శించి మురిసి పోతారు– ఏమే వయ్యారీ అనీ, పిల్లా అనీ భార్యని పిలుస్తారు.

ఇంత చక్కని స్త్రీలని కథల్లో సృష్టించటం వలన శ్రీ శాస్త్రిగారు తెలుగు దేశంచేత సరిగా గుర్తింపబడలేదు. శాస్త్రిగారు నవల వ్రాస్తే చదవాలని ఆశించేవాళ్ళు కొంత మంది ఉన్నారు. ఏది ఏమయినా శాస్త్రిగారు సృష్టించిన స్త్రీలు నిష్పూరవ్వలలాంటి వారు. వాటిలో ఆదర్శం లేకపోవచ్చును, ఆంతర్యం లేకపోలేదు – అభిమానం లేకపోవచ్చును, ఆత్మ లేకపోలేదు – అందుకే మల్లాది రామకృష్ణశాస్త్రిగారు మా గురువుగారయినారు – వారికి నమస్సులు.



# చలంగారూ - ఉత్తరాలూ

ఈమధ్య చలంగారు ఇతర్లకి వ్రాసిన ఉత్తరాలు కొన్ని చదవటం సంభవించింది. కురంగేశ్వరగారికీ, చిన్నా రావుగారికీ, శివంగారికి – చలంగారి మిత్రులు వ్రాసిన ఉత్త రాలు కురంగేశ్వర్ గారు సంపాదించినవీ–ఇలా.

చలంగారిభావాన్ని భాషాపటుత్వాన్ని అభిమానించి ఆరాధించేవాళ్ళలో నేనూ ఒకదాన్ని – ఆయనమీాద ప్రగాఢాభిమానం కలవాళ్ళల్లోకూడా నేను చేరతాను – కానీ

యీ ఉత్తరాలు చదువుతుంటే మాత్రం చాలా బాధగా వుంటున్నది –

ఉదాత్తత అనేది రచనకి కావల్సిన మొదటిలక్షణం. సెక్సుని గురించి చెప్పినా – నిషిద్ధ ప్రేమని గురించి చెప్పినా – నీచ వ్యభిచారాన్నిగురించిచెప్పినా ఉదాత్తత పోకుండా జాలి పడేటట్లు చెప్పగలగాలి గాని తిట్టి జుగుప్సాకరంగా చెప్పకూడదు. అందులో రచనకి ఇది మరీ అవసరం. ప్రపంచంలో – నేను రచయితని అని కలంపుచ్చుకుని వ్రాయబోయేముందు గొంగళి పురుగుల్ని, కుష్టురోగుల్నీ, దొంగల్ని, దుర్మార్గులనీ కూడా ప్రేమించగలగాలి.

చలం లేఖలు కురంగేశ్వర్ కి అనేపుస్తకం 41 వ పేజీలో.

స్త్రీ "ఛీ"అన్నదా, ఆ శబ్దం పది లౌడ్ స్పీకర్లలో నుంచి చెవులు చిల్లులయేటట్లు వినబడుతుంది ఏ పురుషుడికైనా అతను చిన్న పసిపాప అయితే తప్ప నేను పూర్తిగా ద్రవించలేను – అంటారు.

శరత్ బాబు ఒకచోట అంటాడు గదా – నా ఈ చరిత్ర వంగదేశంలో ఎవరికంటివెంట నీరు ప్రవహించినా అది నా గుండెలనుంచి స్రవించిన నెత్తురులాగానే నన్ను బాధపెడుతుంది – అని.

స్త్రీలు – తమ స్త్రీత్వసౌందర్యాలతో – పసిపాపలు తమ పసితనపు సౌకుమార్యంతో ఆకర్షించటాన్ని తన దయ కిందకి మార్చుకోటం కరుణాతత్పరత కాజాలదేమో! వేలాది దీనులూ, దుఃఖితులూ, ఆశోపహతులూ, అదృష్టహీనులూ అయిన

జనాభాకి స్త్రీ పురుషభేదం దేనికి? శారీరకమైన బాధా, మానసికమైన దుఃఖం ఇద్దరికీ ఒకటేగదా! అలా కాకుండా స్త్రీనీ, పిల్లల్నీ అభిమానించడం తమ ఉదాత్తతకే భంగం.

అదే పుస్తకంలో పథ్యాలుగా పేజీలో దోసకాయలూ, ఆగాకరకాయలూ, దొండకాయలూ, బంగమిరపకాయలూ తీసుకురా — కానీ ఆ దేశపు దుమ్ము అక్కడే పీల్చేయండి. ఆదేశపు గాలినీ ఆ దేశపు నీళ్ళనీ అక్కడే వదలి వెయ్యండి అంటారు.

క్షమించాలి — శరత్ బాబు తన దేశాన్ని గురించి శ్రీకాంతతో యిలా అంటారు:

ఈ దేశంలో ఇల్లువదలి వెళ్ళినా, ఆకలితో చావ నక్కరలేదు. ఇంటింటా తల్లీ — చెల్లెలూ వుండి ఆకలితో మనల్ని చావనివ్వరు అని.

ఇది నా దేశం, ఇది నా సంస్కృతి, ఇది నా సర్వస్వం — అనడం అవసరం. అందులో లోట్లు వుండవచ్చును. మనుషులు సంకుచితులూ కావచ్చును. తల్లి సౌందర్యవతి కానంత మాత్రంచేత, తల్లికాకుండా పోదుగదా — ఒకవేళ అలా ఎవరైనా అంటే అది సంస్కారరాహిత్యమే అవుతుంది.

శరత్ బాబుకి కూడా వంగదేశం అన్నం పెట్టలేదు. పొట్టచేతపట్టుకొని బర్మాకి పోయినాడు. అతని పథేర్ దాబీ మీద గవర్నమెంటు నిషిద్ధంపెట్టింది 'చరిత్రహీనులు' వ్రాసి నప్పుడు, 'శేషప్రశ్న' వ్రాసినప్పుడు అతన్ని దుమ్మెత్తి పోశారు. అప్పుడు సురేంద్రనాథ్ చౌధురీకి వ్రాస్తూ వాళ్ళ

నన్ను అర్థం చేసుకోలేదు. ముందు ముందు తప్పకుండా అర్థంచేసుకుంటారు — అంటారు శరత్ బాబు

ఆయన దేశం ఆయనకి అన్నం పెట్టలేదు. ప్రోత్సాహాన్ని యివ్వలేదు. అయినా ప్రేమతో, సౌజన్యంతో — అదే దేశాన్ని, అదేమనుష్యుల్ని ప్రేమిస్తూ క్షమామూర్తిగా పూజనీయతని కూడా పొందారు శరత్ బాబు. సర్వభారతం లోనూ అశేష ప్రజానీకం ఆయన్ని మహారచయితగా గౌరవించడం యీ క్షమా ప్రేమలవల్లనేనేమో బహుశా.

అలాంటిపనులేమీ ఆంధ్రదేశంలో చలంగారికి జరిగినట్లులేదు. పత్రికలు ఆయన రచనల్ని కాదన్నదీలేదు. అన్నం దొరక్క అడవులుపట్టిపోయిందీ లేదు. అయినా యీ దేశపు నీరూ గాలీ ఆయనకి అసహ్యాన్ని కలిగించడం చాలా శోచనీయం.

అదేపుస్తకం పదమూడో పేజీలో కృష్ణశాస్త్రిగారికి సుఖాపేక్ష, పదవీ వ్యామోహం అని విమర్శిస్తారు. కృష్ణశాస్త్రిగారు కవిచక్రవర్తి — ఉదాత్తత ఆయన మొదటి లక్షణం. రమణీప్రియదూతిక, కర్పూరవిడెం జీవనవ్యవసాయంలో కవితాకేదారాన్ని సుఖం పంట పండించుకోటం శ్రీనాథుడిలాగానే శాస్త్రిగారికి కూడా లక్షణం.

కృష్ణశాస్త్రిగారినికూడా లోకంవిమర్శించింది — దేశం బ్రహ్మరథంతోపాటు రాళ్లూ విసిరింది — అయినా,

అది ఏదైతేనేం తెలుగునాటపల్లె —

అని గర్వంగా ఘనంగా అంటారు శాస్త్రిగారు. కస్తూరి ఘుమాయింపుతో — కారులో షికారుతో తరగిపోని ఉపాధు

తో — తన దేశాన్నీ పల్లెల్నీ రైతు వాళ్ళని బల్లుల్ని కూడా ప్రేమించే కవి చక్రవర్తి కృష్ణశాస్త్రిగారికి పదవీ వ్యామోహం అని చలంగారనడం — యీ దేశపుగాలిసికూడా అసహ్యించుకొని దోసకాయల్నీ, మొక్కజొన్న కండెల్నీ, ఆడవాళ్ళనీ, మాత్రమే ప్రేమించే చలంగారనటం — కొంత అన్యాయంగానే వుంది. డబ్బు కృష్ణశాస్త్రిగారికేగాదు, చలంగారికీకావాలి. ఏదైనా రచన కావాలంటే ముందే యివ్వాలి ప్రచురణకర్తలు — అలా యివ్వడం, తీసుకోవటం తప్పనికాదు నేననటం. ఇతర్లు యిదేపనిచేస్తే విమర్శించడం మానెయ్యాలి.

కృష్ణశాస్త్రిగారికి హైదరాబాద్‌లో మర్యాద జరుగలేదు గనుక కీర్తి కోసం పిఠాపురం రాజాగారికి పుస్తకం అంకితం యిచ్చి కోటవేస్తే గెంటండి అనిపించుకున్నారని ఇరవై ఆరవ పేజీలో వ్రాస్తారు చలంగారు.

శ్రీకృష్ణశాస్త్రిగారికి యీ రోజున సకలైశ్వర్యాలు ఉన్నాయి. నెలకి ఆరువందల గౌరవభృతికింద ఆకాశవాణి యిస్తున్నది. ఈ పరిస్థితిలో ధనంకోసం ఆయన అంకితం యిచ్చివుండటం ఎన్నడూ జరిగి వుండదు. ఏమైనావుంటే ఆ రాజ కుటుంబం మీద గౌరవంచేతనే అయివుంటుంది.

ఇక కీర్తి కోసం అనుకుందాం.

పందొమ్మిదో పేజీలో జీవితంలో కొంతభాగం కవితోద్ధరణకి ఇచ్చాడు కృష్ణశాస్త్రి అని — ఇదే చలంగారుచేత అనిపించుకున్న కృష్ణశాస్త్రిగారు — ఇరవయ్యారవ పేజీలో యీ కవిని ఆ రాజు దరిచేర నివ్వలేదు - అనే అవమానకర

వాక్యంతో ఘోషింపబడటం ఆయన కీర్తికి మచ్చ కావటం కాదు.

కృష్ణశాస్త్రిగారికి కీర్తి ఏమిటి? కీర్తికే కృష్ణశాస్త్రిగారు కావాలి

పోనీ చలంగారికి కీర్తి అవసరం లేదా అంటే తప్పకుండా కావాలి.

"పోయిన ఉద్యోగానికి వ్యాజ్యం వేస్తే ఫీజుకింద చలం పుస్తకాలు తెప్పించి పెట్టమన్నాట్ట (32 వ పేజీ)ప్లీడర్"

"చలంయుగం ప్రారంభమైందంటున్నాడు ప్రసాద్" (33 వ పేజీ)

జానకిరాం స్వర్ణసీతమీద అభిప్రాయం వ్రాస్తూ జానకిరాం అందం మరచిపోడుగనుక అంత లాలిత్యం అనే అభిప్రాయం వ్రాస్తూ, చలం బాధ మర్చిపోడుగనుక అంత బలం అని తననిగురించి తనే వ్రాసుకుంటారు చలంగారు. ఇది తప్పనీ. అసత్యమనీ కాదు నేనంటున్నది– కీర్తి అనేది అందరికీ కావాలి, కృష్ణశాస్త్రిగారికే పరిమితంకాదు. "శ్రీ శ్రీ ఉత్తముడు. క్రిష్ణశాస్త్రిలాకాదు." (29 వ పేజీ) అంటారు మరోచోట.

ఇలాటి అభిప్రాయాలు మిత్రులకి వ్రాసుకుంటే వ్రాసుకున్నారుగాని – చలంగారూ, ఆ మిత్రులూ వాటిని ప్రచురించి కొందరు మహావ్యక్తుల్ని అవమానింపచెయ్యకూడదు. కృష్ణశాస్త్రిగారి సాహిత్యంమీద చలంగారి అభిప్రాయాన్ని మనమందరం శిరసావహిస్తాం కానీ, కృష్ణశాస్త్రిగారి వ్యక్తిత్వాన్ని గురించిన అభిప్రాయం చలంగారికే

ఉండాలి. ఒకవేళ మిత్రునికి వ్రాసుకున్న వాటిని ప్రచురిస్తే దేశం అంగీకరించకపోవచ్చును.

పబ్లిషర్లనీ, పత్రికల వాళ్ళనీ, రేడియో వాళ్ళనీ పదవిలో వున్న వ్యక్తుల్నీ, దేశాన్నీ, దాని గాలినీ, దాని వ్యక్తిత్వాన్నీ, అన్నిటినీ తిట్టడమే – మళ్లీ, యిదే దేశం నుంచి కీర్తి, డబ్బూ – రెండూ కావాలి.

చలంగారు గొప్ప రచయితలు. కాదని అనటానికి ఎవరికీవీలులేదు కాని ఇటీవల వస్తున్న పుస్తకాలన్నిటిలోను ఉత్తరాలనబడేవి మాత్రం అసహ్యంగా – ప్రమాదకరంగా– ఆయన కీర్తికే మచ్చతెచ్చేవిగా వుంటున్నాయని చెప్పక తప్పదు. ఇటీవల శివంగారికి వ్రాసిన ఉత్తరాల్లో ధనవ్యామోహం ప్రెజుడిస్, కసి, చౌకబారు కీర్తి, తాపత్రయం కనిపించి చాలా జాలివేసింది.

తెలుగుదేశం తెలివి తక్కువది కాదు – హృదయ విహీన అసలేకాదు. అయినా ద్వేషించడం అన్యాయం కిందికే వస్తుంది.

చలంగారి మీద అందరికీ కోపమే అని చలంగారెందుకని అభిప్రాయపడుతున్నారో అర్థంకాదు సౌమ్యమూర్తి, కరుణాళువూ కావల్సిన రచయిత కోప్పిష్ఠి, తిట్టుబోతూ కారాదు.

భగవంతుడిని ఒకప్పుడు ఘోరంగా ద్వేషించిన చలంయిప్పుడు తనకుమార్తె సౌరిస్‌గార్నే ఈశ్వరుడని నమ్మడం వారికి మతిస్థిమితం లేదనటానికి మరో నిదర్శనంగా కొందరనుకుంటున్నారు. పైగా ఆ ఈశ్వరుడు (సౌరిస్) పచ్చి

మెరపకాయల కారం చెయ్యమంటాడు — నెయ్యి వేసుకో వద్దంటాడు — ప్రస్తుతం ఇదేపనిమీద ఈశ్వరుడి సర్వదృష్టి కేంద్రీకరింపబడటం శోచనీయం. పాపం ఈశ్వరుడు!

ఎంత ఎదిగినా మానవుడు మహా మానవుడు కావచ్చునేమోగాని దైవం కాలేడు. అలా భావించడం ఆత్మవంచనే అవుతుంది. సౌరిస్‌గారు యోగినీ మహా భక్తురాలు కావచ్చును. అంతమాత్రంచేత చలంగారావిడని ఈశ్వరుడని మనల్నిఅనమని — ఆవిడ వ్రాసిన జీసెస్‌ని మళ్ళీ డబ్బెట్టి కొనమనటం శుద్ధ అన్యాయం — మనిషికై తేనే ధనంకావాలికానీ దైవానికి అవసరంలేదు.

ఇలాటి అల్పవిషయాలన్నీ యీ ఉత్తరాల్లో వ్రాసుకుంటే వాటిని బహిరంగపరచడం — తీరని అన్యాయం వారికే జరగటానికి ఒక కారణం అవుతున్నది — వీటిని ప్రచురించరాదు — ప్రియురాలికి ప్రియుడు కవిత్వంతోపాటు బూతులు కూడా వ్రాయవచ్చును. అవి ప్రచురింపదలిస్తే కవిత్వం నుంచి బూతులు తీసివెయ్యాలి. వ్యక్తిగతమైనవి గనుక యీ ఉత్తరాల్లో కూడా వ్యక్తినింద నిషిద్ధం. అలా చేసినందువల్ల ఆ మహారచయితకి తీరని ద్రోహమే అవుతున్నది. ఈ విశ్రాంతిలో ఉదాత్త సాహిత్యాన్ని తన దేశానికి ప్రసాదించమని వారికి నా ప్రార్థన.



# నేను, జీవితమూ, రచన

"నేను, జీవితమూ, రచనా" అనే విషయం మీద మాట్లాడమని మా రోటరీక్లబ్బు సెక్రటరీ నన్ను కోరారు. నన్ను గురించి నాకు తెలియదేమో అని భయపడ్డాను గాని నా రచనల్ని గురించి కొద్దిగా తెలుసు.

భవిష్యత్తులో ఏ పత్రికయినా నా ఈ మాటల్ని ప్రచురించటం జరిగితే లత తనని తనే విమర్శించుకుంటున్న దనరు — రచనల పబ్లిసిటీకో, మరెందుకో అంటారు. దీని మీద చిన్న సైజు గాలి దుమారం చెలరేగే అవకాశం కూడా ఉంది. ఏది ఏమైనా నన్ను గురించి, నా రచనల్ని, జీవితాన్ని గురించీ మాట్లాడ మన్నారు గనుక మాట్లాడతాను.

లత ఎవరో, ఏం చేసిందో ఎప్పటికయినా మరో లత జన్మించడం జరిగితే విడమర్చి చెపుతుంది. అర్థరహితమైన ఆవేదనకీ, అననుభూతాలైన ఆవేశాలకీ, అందుకోలేని అనుభవాలకీ ఆమె కల్పిస్తున్న ఈ రూప కల్పనకి శాశ్వతత్వం ఉందో లేదో కాలమే నిర్ణయిస్తుంది. అయితే ఆ కాలం కోసం నిరీక్షించే ఓపికా, తీరికా కూడా మనకి లేవు. అందుకే మీరు ఆ ప్రశ్నకి సమాధానాన్ని కూడ నా నుంచే కోరుతున్నారు. కాని, సమాధానం ఎంత మటుకు ఇవ్వగలనా అని సందేహంగా ఉంది.

మోహానవంశీ అనంతరం రాగజలధి వెలువడింది. దురదృష్టవంతుడైన ఒక రచయిత జీవితాన్ని ఆధారం చేసు

కొని వ్రాసిన నవల రాగజలధి. కాగా, నిషాలయిన ప్రేమా నుభవం జీవితాన్ని వెలిగిస్తుందా ఆర్పివేస్తుందా అనే ప్రశ్నకి సమాధానాన్ని అన్వేషిస్తూ ఇది సాగి పోయింది.

అసలు ప్రేమానుభవమే నిషా అయినది. ఎవర్ని, ఎందుకు, ఏ క్షణంలో ప్రేమిస్తామో, ఆ ప్రేమకీ ఆరాధనకీ కారణమేమిటో, వారి నుంచి మనం కోరుతున్న దేమిటో తెలిసికోగలిగిననాడు విశ్వ రహస్యమే అర్థమయిపోతుంది. ఏదో ఒక క్షణంలో వారి మీద ప్రేమ, మరో తళుకు క్షణంలో వారిమీద ఆపుకోలేని వాంఛ... దానికి కొన్ని యుగాలు వాయిదా వెయ్యవలసి రావటం - వీటన్నిటికీ వ్యాఖ్యానమే రాగజలధి అనుకుంటాను. ప్రేమలేని కామం, కామంకలగని ప్రేమ — ఈ రెండిటికీ మధ్యపడి నటరాజు నలిగిపోతాడు.

మీనాక్షి మీద అసూయతో కృష్ణహరి జీవితాన్ని నడివీధిలో పారవేసుకొంటుంది. తమాషా ఏమిటంటే, యుగ యుగాలుగా సాగి వస్తున్న ఈ జీవనహోమానికి హోతా, హావిస్సుకూడ మానవుడే. ఏదో పైశాచిక హస్తం మానవు డిని తునిగీలు తునిగీలుగా ఆ యజ్ఞ గుండంలోకి విసిరి వేస్తు న్నది.

నిజమైన శేషం ఆ అవశేష భస్మంలోంచే మొలకెత్తు తుంది. కొంచెం సూక్ష్మంగా పరిశీలిస్తే మానవ వాంఛకి వ్యావ స్థలో ఏదో లోటు కనిపిస్తున్నది. అది ఏదో నిర్ధారణగా చెప్పలేని రచయిత —— సూత్రపారంగదుడే కాని సూత్ర స్రష్టకాని రచయిత —— ఆ లోటు చూసి బాధపడతాడు.

ఆ బాధని లోకానికి వ్యక్తీకరిస్తాడు. అప్పుడు దానిని దిద్దడానికి ఎవరో కావాలి. ఆ చేయూతే అతనికి లభించకపోతే తన ఆవేశానికి తనే బలి అయిపోవటం సంభవిస్తుంది. నటరాజన్ అలాగే బలి అయినాడు.

ఇందులో రచన ఏకాంత నిశీధినిలా, కదన రంగంలో కుపిత ఉన్మత్త కాళీరూపంలా సాగింది. ఆమె విరబోసిన కేశ రాశితో భూమ్యాకాశాలు ఆచ్ఛాదితమైనాయి.

మహాంధకారన్ని చీల్చుకొంటూ, దిగంత వ్యాప్త మైన కాలయవనికని ఛేదించుకొంటూ అప్రతిహతంగా ఉన్మత్త యువతిలా పరుగెత్తింది రచన.

తనదికాని స్త్రీని తనదిగా భావించటం ఒక తప్పు. దానికి ప్రేమ అని పేరు పెట్టడం మరో తప్పు ఆ భావనని లోకానికి చాటటం అన్నిటికంటె పెద్ద తప్పు. ఇది సంఘ దృష్టి. లేకపోతే ఇవ్వ గలిగిందీ, తీసుకోగలిగిందీ లేనప్పుడు అంతటి ఆరా (టం) ధన వ్యర్థమే అనిపించి ఇదేదో ఉన్మాదం అని కూడా అనిపిస్తుంది.

దీన్ని గురించి నా శక్తి వంచన లేకుండా రాగజలధిలో చిత్రించటానికి ప్రయత్నించాను. నిజం చెప్పాలంటే, నాదో ...నాదికాదో తెలియదుగాని ఏదో ఒక దివ్యానుభూతి మనస్సుని నిషాలా ఆవరించి నాచేత వ్రాయిస్తూ ఉంటుంది.

రాగజలధికి అర్థం ఏమిటో ఇప్పుడిప్పుడే తెలుస్తున్నది నాకు.

జీవితంలో ఒక వ్యక్తి మీదే రాగజలధి తాలూకు అలలు ప్రవహిస్తాయనుకోవటం పొరపాటు. అసలు జలధి ప్రవ

హించదు. అల తరువాత అలగా అలా వెలువరిస్తూనే ఉంటుంది. అనుక్షణం వెడుతూ ఉండే దాని ఘోషలో మిగ వన్నీ భ్రమలు. విశ్వజనీనమూ, సార్వకాలికమూ అయిన సమ్యగ్దృష్టి నాది. రాగ తరంగిణి పెనుసుడిలో మెలిదిరిగి పోవటమే నేను అనే సందేశం వినిపిస్తూనే ఉంది.

అయినా మనం అర్థం చేసుకోలేకపోతున్నాం. ఈ స్త్రీ నాకే ఉండిపోవాలనీ, ఈ పురుషుడు నాకే ఉండిపోవాలని కోరి, తద్వారా శాంతిని కోలుపోతూ ఉంటాం. ఈ ప్రపంచంలో రాగజలధికి వారధిలేదు. అది ఏకోన్ముఖమూ కాదు. ఇంద్రధనస్సులా, అరోరా బోరియాలిస్‌లా, జలపాతంలా వర్ణయుక్తమై, జీవితంలా శబ్దయుక్తమై అది అలా నిలబడే ఉంటుంది.

ఇందులో కృష్ణహరి అసూయతో జీవితం వ్యర్థం చేసుకుంది. అతను తనవాడు కాకపోయినా ఫరవాలేదు, ఇంకో స్త్రీ కి చెందకుండా ఉంటే చాలు. మీనాక్షి అలాకాదు, ఆమెకి తనదంటూ ఏమీలేదు. అలా ఉండాలనీ అనుకోదు.

ఇవ్వగలిగిందేదైనాఉంటే దాచుకున్నందువల్లప్రయోజనం లేదని ఆమె అనుకుంటుంది. పాతివ్రత్యం చెడినా ఫలితం దక్కాలనే మీనాక్షికీ, ఫలితం దక్కి పాతివ్రత్యం కూడా దక్కాలనే కృష్ణహరికీమధ్య ఆరణి నలిగిపోతాడు.

ఆడదాని అసూయ చిత్రమైనది. సామాజికుడూ నటుడూ అయిన మగవాడికి అది ఒక వినోదం. అంతేకాదు, గర్వం కూడానేమో.

యోగసారోపనిషత్తులో కాబోలు "తితిర్మూర్తి నాపి సాచా ప్రతిహాతా శక్తిః" అంటాడు. మనిషి సంకల్పం కూడ ఒక పదార్థమే. దానికి అద్భుతమైనశక్తి ఉంది. Symbolic Thinking చాలా బలవంతమైనది కాని అసూయ మాత్రం Impulsive Thinking ఆవేశంతో వచ్చే ఆలోచనఅది.

దాన్ని తట్టుకోవాలంటే ఎదటి వాళ్ళకి సహజ జ్ఞానంతో కూడిన ఆలోచన కావాలి. నవలా రచనలో పటిని గురించి వ్రాయటం తేలికేగాని వాస్తవిక జీవితంలో అవి అను భవానికి వచ్చినప్పుడు మానమూ Impulsive Thinkingకి లొంగిపోతాం.

బాలెన్సుతప్పి భరతనాట్యం ప్రారంభించకుండా ఉండా లంటే- అప్పుడు మనకి అద్భుతమైన మనస్సంయమం అవసరం అశక్తురాలైన ఆడదాన్ని తన శక్తి ప్రాకారంలో దాచి అదే గర్వంతో శక్తిని సమకూర్చుకొంటున్న మగవాడు ఆ క్షణంలో శక్తిహీనుడై చిరునవ్వు నవ్వుతాడు. ఆ చిరు నవ్వుకి మరింత మండిపోతుంది స్త్రీ.

రాగజలధి అదే.

దాని కార్య కారణాల్ని గూర్చి విచారించాలని ఇప్పుడు నాకు అనిపించడంలేదు. సూచీభేద్యమైన ఈ స్మశాన లోకంలో కేవలం నేనొక పాంథురాల్ని మాత్రమే. వనాలు, కొండలు. వృక్షాలు మాదిరిగానే నాకూ ఒక స్థిరత్వం ఉంది ఈ సర్వలోకమూ విశృతంగా విశ్రాంతి తీసుకొంటున్నప్పుడు నాతోబాటు రాత్రి కూడ రచన సాగిస్తుంది. సర్వప్రకృతీ ఊపిరి బిగపట్టి ఆమె ధ్యానానికి అడ్డురావటానికి భయపడే

సమయంలో ఆమె కలంలోంచి ఏదో సౌందర్య ప్రవాహం ప్రవహించి స్పాంజిలా నన్ను స్పృశిస్తుంది.

ఓ అంధకార సుందరీ! నీవెవరు? ఓ అనంత సౌందర్యవతీ! ఒక్కసారి నీ కాళీ ఉన్మత్త రూపాన్ని నాకు చూపించు. అయినా వినిపించుకోకుండా మహా రచయిత్రి రాత్రి తన రచన సాగిస్తూనే ఉంటుంది.

*　　　*　　　*

ఒకానొకప్పుడు దేశంలో నిరంకుశత్వం అధికమయింది. అప్పుడు భావుకులకూ, మేధావంతులకూ జనం స్వాగతం యిచ్చారు. అందుకు కారణం ఉన్నది. అప్పటి మేధావంతులు అనుభవానికీ వాస్తవికతకీ దూరంగా నిలబడి చర్యలు సాగించేవారు కారు. వాస్తవిక చిత్రింపై చూపు నిలిపి పరీక్షించేవారు. అందుకనే జనం వారిని ప్రతినిధులుగా ఎన్నుకొనేవారు. ఇప్పటి పరిస్థితి దీనికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంది. తెలివితేటలు కొంచెం అతిగా ఉన్నాయ్ జీవితానికి విలువలు తగ్గినయ్. అనుభవం మీద అశ్రద్ధ ఎక్కువయింద.

కోటానుకోట్లప్రజల సుఖదుఃఖాలూ, రాగ ద్వేషాలూ అర్థంచేసుకొని అందుకు తగ్గట్టు స్పందించడం మానేసి ఊక లాంటి కావ్యాలు వ్రాస్తున్నాడు ఆ మేధావంతులలో ముఖ్యుడైన రచయిత. జీవితంకన్నా సిద్ధాంతం ముఖ్యమైపోయింది. బ్రతుకును గురించి అనాదిగా మేధావంతులు చర్చిస్తూనే ఉన్నా నిజానికి తేలేది ఏమీ లేదు.

క్రియారూపంలో మార్పు లేని రచన వృథా. చర్చ వృథా. కళలు అసలే వృథా. అదే సిద్ధాంతం మీద వ్రాసిన

నవల "జీవన స్రవంతి". ఇది ఇంతవరకూ నేను పడుతున్న విమర్శల నుంచి నన్ను రక్షించింది. అంతవరదాకా నన్ను తిట్టిపోస్తున్న ఒక విమర్శకుడు "హమ్మయ్య! లత ఇప్పటికి గొప్ప నవల వ్రాసింది." అని ఒప్పేసుకున్నాడు పాపం! అదివరదాకా అవినీతి. అస్వాభావికత కనిపించినయ్యన్నవారు దీనికి స్వాగతం ఇచ్చారు.

మన వివాహసంస్థలోని లోపాలు, బాల వితంతువుల వేదనలు, వాటి వెనక ఉన్న విశ్వజనీనత 'జీవన స్రవంతి'లో మీకు కనిపిస్తాయి. ఇది అసలువిమర్శించబడనేలేదు. పత్రికలన్నీ పొగిడాయి దేశం నలుమూలల నుంచీ ఉత్తరాలు కురిశాయి.

అసంబద్ధ విధి నిషేధాలతో బాధచెందుతున్న మానవ జీవితానికి గొప్ప సానుభూతి ఇచ్చిన పాత్ర ఇందులో ఉంది. అది వెంకటరత్నం. ఈ నవలకీ నాకూ చాల సాన్నిహిత్యం ఉంది. మూడు తరాల జీవితాలూ, వాటిలో లోటుపాట్లూ తినడానికి ఉండీ శాంతిలేని కులీన కుటుంబాలు కనిపించే కన్నీటి కథ ఇది. ప్రేమకీ, బాధ్యతకీ, ఆంతర్యానికీ. కర్తవ్యానికీ, ఆనందానికీ ఆత్మవంచనకీ మధ్యపడి నలిగిపోతున్న వ్యక్తులకు ఇది ప్రతిబింబం. వరాలు, పూర్ణ, రాజా, భాషా, సబారంజనీ — వీరందరూ కాలానికి అతీతంగా ఆలోచించి కూడ కాలగమనంతో సాగిపోక తప్పని అభాగ్యులు. అనంత కాల యాత్రికుడూ, దీర్ఘపథగామీ అయిన మనిషి తన బరువు దింపుకోటానికి విశ్రాంతిస్థలం కోసం ఎలా వెతుక్కుంటాడో, ఎంత బాధపడతాడో ఈ నవలలో వెంకటరత్నం వలన మనకు తెలుస్తుంది.

విశ్వేతిహాసంలో వసంత మారుతాలవంటిది సాహిత్యం. హేమగిరి శిఖరాగ్రాన ఆసీనమైన మహాయోగిని లాంటిది రచన. కరిగిపోకుండా కదలగల సజీవ స్మారకం రచన. మనిషి కొన్ని అంగీకృతులతోనూ మరికొన్ని అనంగీకృతులతోనూ జీవిస్తూ ఉంటాడు. పూర్తిగా అంగీకృతితో జీవించితే మతంలా రాయి అవుతాడు. అతని అంతర్జగత్తు ఒక కాల్పనిక సత్యం. అతని లోకంలో జలకుంభాలు మోసుకెళ్ళే స్త్రీలు, విశ్వసభాప్రాంగణంలో తమ వీణను శ్రుతి చేసుకొంటున్న గాయకులు – వీరంతా అతన్ని కదిలిస్తూ ఉంటారు.. ఆ కదలిక సవ్వడులే రచనలు. ఆ కర్తే రచయిత. వెంకటరత్నం రచయిత... కాని, తత్వవేత్త. అందుకే అతని రచనలు మిగలవు. మిగలాలనే ప్రయత్నంలో మేనకోడలయిన పాపని తనలా తయారు చేసి తను ప్రతిబింబిస్తాడు. చివరికి ఈ కథ నంతటినీ ఇలా సమీక్ష చేశాడు.

ఆ ఇంట్లో విషాదకరమైన ఆఖరిరోజున ఇలా అనుకొంటాడు అతను– ఆ ఉత్తర వేపు వసారాలో తను చాలా రోజులు నిద్రించాడు. తనకిది మాతామహస్థానం. నాలుగేళ్ళ పిల్లాడప్పుడు ఈ ఇంటి దొడ్లోనే ఆవు దూడలతో ఆడాడు. ఒకసారి ఆవుదూడ పడతోస్తే మేనమామ వచ్చి ఎత్తుకొన్నాడు. ఈ రోజు తనని విధి పడతోసినా ఆయన తనని లేవదీయడానికి రాడు. ఈ ఇంట్లోనే తన బాల్యం గడిచింది యవ్వనం ఎప్పుడొచ్చిందో ఎవరికీ తెలియదు. పూర్ణ ఒక దుర్ముహూర్తంలో తన బ్రతుకులో అడుగు పెట్టింది. రెండో అడుగు తను వెయ్యనీయలేదు. రాజా – విడని తను ప్రాణ

ప్రిదంగా ప్రేమించాడు. కాని, వాడూ తనకి మిగలడు. తనంత ప్రాణప్రదంగానే వాడిని ప్రేమించిన మరో వ్యక్తి వరాలు. ఆ రోజుల్లో తన హృదయం ఆమెను అసహ్యించు కునేది. ఈ రోజు అదే హృదయం ఆమె ముందు అవనతమై పోతున్నది. ఇక్కడే తను అనేక దినాలు గడిపాడు. అతని కన్నుముందు ఆ ఇంటి చరిత్ర కనుపిస్తున్నది. తన తాతగారు కృష్ణయ్యగారు, ఆయన భార్య, తన మాతామహి రామమ్మ గారు — వాళ్ళిద్దరూ ఇప్పుడు లేరు. వాళ్ళ జ్ఞాపకం కూడ విలుప్తమై పోతున్నది. ఈ రెండు పాత్రల మధ్య మహోజ్వలంగా దర్శనమిచ్చే మరో పాత్ర సభారంజనమ్మ. తరువాత తన మేనమామ, మేనత్త, వీళ్ళు యిప్పుడు కనిపించటంలేదు. వీళ్ళిద్దరిమధ్యా కొంతకాలం మెరిసి ఆరిపోయిన ఉజ్వల దీపశిఖలాంటి పాత్ర భాషా. ఇక రాజా, రాజా భార్య, వీరిద్దరూ ఏమి అవబోతున్నారో తెలియదు. వీరిద్దరి మధ్యా కూడ అంతర్వాహిని సరస్వతీ నదిలాటి పాత్ర వరాలుది ఉన్నది. మూడు తరాలు మూడు కథలు. ముగింపు మృత్యువు తనే అవుతున్న మూడుజతల జీవితాలు. ఇది జీవన స్రవంతి. దీనికి ప్రేక్షకుడూ, సమీక్షకుడూ వెంకటరత్నం. నా సహోద్యోగీ, మిత్రుడూ అయిన మల్లాది నరసింహశాస్త్రి ఈ నవలా రచనలో నాకు చాలా సహకరించారు. భాషా పాత్ర ఆయన ఇస్తే దానికి రూప కల్పన చేశాను.

జీవన స్రవంతి సాగిపోతూ ఉన్నంతకాలం సమీక్షా తప్పదేమో !

# " నేను - రచన "

జీవితం చిత్రమయినది.

జీవన ప్రకరణలకు సంబంధించిన అనేక కథలు దిక్కు-లేని పసిపిల్లలులా విలపిస్తుంటే పోనీగదా పాపం అని పుష్పక విమానం వంటి తన ఆంతర్యంలో వాటికి చోటిచ్చి స్థలం చాలక ఇరుకునపడే అద్దెకొంపలాంటిది జీవితం.

ఇంతవరకు జీవితం నిజస్వభావం ఎట్లాంటిదో నాకు అర్థం కాలేదు.

విపరీతమయిన జీవన లాలస వెఱ్ఱిపరుగులు పెడుతూంటే చావకుండా బ్రతక్కుండా కాలం శపిస్తుంటే ఎక్కి వెక్కి ఏడ్చే దిక్కులేని రోగిలా ఒకచో గులాబీలూ, పాలూ రంగరించి మెదిపిన బంగరు బొమ్మలా, ఒకచోట నడవడం చాతగాని చిన్నారి శిశువులా, వేరొకచోట ఏదో ఒక విచిత్రమైన భ్రమావరణ ఇంద్రజాలిక తెరలా కనిపించి నా కనులముందు దించివేసి ఘోషాస్త్రీ లా మరుగునపడి ఉండిపోతుంది ఈ జీవితం.

కనుకనే జీవితం అంటే ఒక విధమైన కాల్పనిక దృష్టిని పెంచుకున్నానేమో అనుకుంటాను

అడవిలాంటి ఉద్యానంలో రంగురంగుల పూవులు వికసించి – దశదిశలా ఆవరించివున్న నీరవ నిశ్శబ్దంలోంచి – పాడే సంగీతం నా జాగృత ఆత్మజ్ఞానశక్తి వినిపిస్తూనే

వుంటుంది. ఈ అస్పష్ట వాణీరూపంలోనే సర్వ ప్రపంచమూ తన ఆధిభౌతిక స్వరూపాన్ని సందర్శించుకొంటున్నది.

ఈ వాణీరూపంలోనే మోహం, సౌందర్య దర్శనం కాంచగలం.

మేఘాలు తేలియాడు అగుణారుణ కాంతిని అర్థంచేసుకోవడానికి, కృష్ణవేణీ జలంలా ఆంతర్యం జలతరంగిణి కావడానికి, ఈ వర్షమయ చిత్రి జగత్తున జీవితం రాగరంజితమవడానికి — అన్నిటికీ ఈ వాణీ రూపమే కారణం.

ఈ రూపమే సర్వత్రా జ్యోతిర్మయమై సంక్షోభిస్తున్నది. దీనిని ఆధారం చేసుకోవాలనే మానవుని సుదీర్ఘ యత్నం, ప్రియత్నం. ఇదే వేదన. ఇదే పిలుపు ఎప్పుడో ఒక నాడు నన్నూ పిలిపించింది.

ఆ పిలుపుకు ఆకర్షితురాలనవుతూ, ఆవేదనలో మునిగి తేలుతూ అనేకానేక సుడిగుండాలలో ఇరుక్కున్నాను. ప్రవహిస్తూ ప్రవహిస్తూ చాలా దూరమే వచ్చానను కుంటాను.

ఈ జీవజనత మహావేదనలో కొట్టుకుపోకుండా చేతులు అడ్డి నన్ను నేనే రక్షించుకుందామని ఎన్నిసార్లు ప్రియత్నించినా ఓడిపోతూనే వున్నాను.

ఆ ఓటమిలోంచే ఉద్భవించింది రచన.

అది ఏమిటి ? ఎందుకు ? ఎవరికొరకు ? ప్రయోజనం ఏమిటి ? — దానికి సమాధానాన్ని మీరు నానించి కోరితే చెప్పడం చెప్పగలను గాని, సమాధానం సరి అయినది అవునో కాదో నిర్ణయించలేను.

ఈ ప్రపంచాన్ని పూర్తిగా మరచిపోయి, అంతర జీవనానికి తలుపులు తెరచి సువర్ణమయ చతురస్రంలో నేను ప్రతిష్ఠించుతున్న దేవీమూర్తి రచన.

ఎవరని చెప్పగలను ? ఏమని చెప్పగలను ? అన్నిటినీ మరచిపోయి ఆమెను చూస్తూ గుర్తించాలని కూడా ఎంతో కాలంగా ప్రయత్నిస్తున్నాను.

ఆ ప్రయత్నంలో నా కనులు తరచు కన్నీటితో నిండి సరిగా చూడనీయవు.

అప్పుడామె తన కొంగుతో నాకన్నీరు తుడిచి తనను గుర్తుపట్టడానికి మరొక అవకాశం యిస్తుంది.

నా కనులలో అలసట, దుఃఖపు నీడలూ వ్యాపించినపుడు తిరస్కారంగా ఆమె నవ్వే చిఱునగవు నాకు క్రొత్త శక్తిని సంతరించి పెడుతుంది.

ఆమె ఒక అపూర్వ, అపురూప విషాద, మాధుర్యాల సమ్మిశ్రణం. ఆమె పిలుపు చిత్ర విచిత్ర జంత్ర వాద్య సంగీతం.

ఆమెను అవమానపరచి తప్పుకపోవాలని అనేకసార్లు ప్రయత్నించాను. ఓడిపోయాను. ఈ ఓటమియే ప్రతి ఓటమినీ ఒక నవలగా - ఒక జీవితంగా తీర్చి దిద్ది, దాని రచనా కర్తృత్వం పీఠంపై నన్నే ఆశీనురాలిని చేస్తున్నది.

ఈ మణిమయ కిరిటానికి అర్హత ఆ జీవితానికే ఉన్నది కాని నాకు లేదు.

జీవితం మాతృక, రచన తూలిక. నేను ఉత్త చిత్రకారిణిని.

ఈ శతాబ్దపు ప్రస్తుతంలో ఆలోచన కలవాడు జీవితాన్ని నేలరాచి విజయగర్వం పొందుతున్న మాట పూర్తిగా అబద్ధం కాదు. రచయితలో ఆ గర్వం కించిత్ అధికంగానే వుంటుంది. అందువల్ల తన కది అప్పుడప్పుడూ ఆశయే అయినప్పటికీ ఆ దుర్గమ మార్గాన్నే అనుసరించాలని తరచు ప్రయత్నిస్తుంటాడు. అట్టి స్థితిలో అప్పుడప్పుడూ ఓడిపోయి ఆపాదమస్తకం అపకీర్తి పూసుకొని పరాజయాన్ని పొంది అల్పత్వాన్ని కొని తెచ్చుకోవడం వినా మిగిలేదేమీ వుండదు

రచన అంటే ఏ సుదూర శతాబ్దాలలోనో వుండి ప్రస్తుతం నుంచి పారిపోవాలనే కోర్కెయే.

వర్తమానం బహుళ సంక్షిప్తంగా వుండడంవల్లనే రచయిత ఆలోచనాపరు డవుతున్నాడు. అవక తప్పదు.

ఈ పరిస్థితులలో అర్థంలేని భయం, చింత, చీకాకులు వర్తమానానికి అసలే భయపడిపోతున్న రచయితని మరింత భయోపేతుణ్ణి చేస్తున్నది.

ఈ వికార స్తబ్ధతనించి రక్షించ గలిగినది కేవలం మృత్యువు ఒక్కటేనేమో అనే అనుమానం కూడా అప్పుడప్పుడూ అవతరిస్తూంటుంది.

మృత్యువు అసత్యవాదిని కాదు. వాస్తవం వెలిబుచ్చాలంటే జీవితమే ఓ పెద్ద అసత్య రచన. చిరిగిపోయిన పుట.

మృత్యువు అట్లాకాదు. మృత్యువు అసత్యాన్ని చెరపి అనంతర జీవితానికి ప్రథమ ప్రకరణం చూపుపై అంతస్థ విచిత్ర రచయిత్రి.

జీవితం నుంచి తప్పించుకోడానికి గతి మృత్యువే. జీవిత అనిశ్చిత సంశయాల కన్నింటికీ చివరి సమాధానం మృత్యువు

ఆత్మ ఆశించే మహా శూన్యం మృత్యువే అయి వుండ వచ్చు.

ఇక్కడే రచయిత విచిత్ర కల్పనాశక్తికి రూపకల్పనం చేయు కలం ఐంద్రజాలికప్పు కుంచెగా మారక తప్పదు.

ఏది సత్యం ? ఏ దసత్యం ? ఏది నీతి ? ఏది నేతి ? పాపపుణ్యాలకు పరిధి ఏది ? కిన్నిటికీ చిఱ్ఱగవుకూ ఎంత దూరం ? చెత్త కుండకీ విద్యుద్దీపానికీ నీడ నల్లగానే ఎందు కుంటుంది? సత్యానికీ భగవంతునికీఉన్న సామాజిక సంబంధం ఎటువంటిది ? గీత ఎక్కడ ? అర్థరహిత ఆవేదనకు అకారణ ఆనందానిగి అవధు లెక్కడ ? ఇన్ని ప్రశ్నలు, నమాధానం లేకుండా ఐదేళ్ళపిల్లాడి అల్జీబ్రా గణితంలా అర్థం కాకుండా వేధిస్తున్న ప్రశ్నలు. వీటికి సమాధానం కావాలి. ఆ సమాధానం కొరకే ప్రపంచం రచయిత వేపు చూస్తోంది."

రచయిత జవాబు చెపుతాడు. జంకడు. అయితే ఆ రచయిత న్యాయమూర్తి అయి, స్వలాభ రహితుడయి, స్వేచ్ఛామూర్తి అయి, సత్య సత్వ స్వరూపియై నిర్లిప్తంగ, నిర్మోహంగ, నిశ్చలంగా, సమాధానం చెప్పగలిగిన నాడే

అతడు మహారచయిత అవుతాడు. ఆ సమాధానం సరి అయి నది కాకపోవచ్చును లేదా సరయినదే కావచ్చును. దాని సత్యాసత్యాలను గురించి కాదు. నిజాయితీని గురించే ఆలో చించాలి. వాస్తవాన్నే వ్యవస్థీకరించుకోవాలి.

రచయిత సృష్టించే పాత్రలు, వర్ణించే వర్ణనలు, ఎదు రయ్యే సమస్యలు, ఎదురొక్కనే సంఘటనలు — అన్నిటినీ నిరా సందకరమైన ఆంతర్యంతో, నిర్వికార సచేతనా బుద్ధితో చిత్రించుకొంటూ పోవాలి. ఇందున ఒక్కొక్కసారి నీచాతి నీచమయిన సంఘటనలను, అసభ్యతలను రచయించ రావ చ్చును. అట్లాగే ఆమెయే ఆనందదాయకమైన, సౌందర్య ప్రపూర్ణమయిన దృశ్యాన్ని వర్ణించవలసి రావచ్చును, అపూర్వతను చిత్రించవలసి రావచ్చును. రచయిత అనై చ్యాన్ని నిందించడం గాని, ఈ ఔన్నత్యాన్ని ఆదరించడం గాని చేయకూడదు. ఈ రెండు కోణాలూ కూడా అతని అంతరాన్ని తాకకూడదు.

విరిగిపడే కడలి కెరటాలకు చలించని బలిష్ఠపు కొండలు కావాలి రచయిత గుండెలు. అప్పుడే — అటువంటి గుండె ఉన్నప్పుడే సృష్టికర్తకు ఎదురు నిలవ గలుగుతాడు రచయిత. ఏదురీతకు అలవాటు పడతాడు. ఇది అందరికీ అల వడక పోవచ్చును. కష్టం కూడాను. అంత మాత్రాన అతను నిరుత్సాహానికి దాసానుదాసుడవరాదు. ప్రయత్నం ! ప్రయత్నించాలి !

